
తప్పక చూడండి!
జీవంలేని శిల్పాలకు
ప్రాణదానం చేయవచ్చు,
వర్షించని మేఘాలనుంచిసైతం
కుంభపోతలు కురిపించవచ్చు.
అంతేగాని, స్త్రీ మనసు
మార్చటం అసంభవం!
డి.వి.యస్. ప్రొడక్షన్స్
తిక్కశంకరయ్య
దర్శకత్వం: డి.యోగానంద్ నిర్మాత డి.వి.యస్.రాజు
ఆంధ్ర-సీడెడ్. విజయ • నైజాం. ఉషా • మైసూరు సదరన్ మూవీస్
STUDIO Kathy

# ఆంధ్రపత్రిక

## కీలక సంవత్సరాది సంచిక

[ఏబది ఎనిమిదవ సంచిక]



[1968-69]



సంపాదకులు:

శివలెంక శంభుప్రసాద్



వెల రూ. 3

ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు.

Supplement to Andhra Patrika issue dated 2[illegible] 3 1968, Regd No M1115)

# జలుబులను నివారించే మరో దివ్యమైన శక్తి



# అనోలియం

ఇతర ఔషధాలకంటె బహుదా ప్రయోజనకరమైనది.

అనోలియం ఎలా వాడాలి?

1 గుండెమీద రాయటం

2. ముక్కు ... అటూ, ఇటూ రాయటం

3 మెడమీద రాయటం

4 అనోలియంను వేడినీటిలో కరగించి, దాని ఆవిరి పీల్చటం.

జలుబు చేసేవరకు ఆగకండి. నేడే అనోలియం కొనండి

AMC I TEL

ఆశాల గోపాలాన్ని
అత్యంతంగా ఆనందింప చేస్తున్న ఉత్తమ చిత్రం!



**ఓమ్**

# ప్రస్తావన

ఒక సంవత్సరం గడిచి ఇంకో సంవత్సరం వచ్చేసింది. ప్రకృతి కూడా హేమంత శిశిరాలలో ఆకు రాల్చుకొని, కొత్త ఆకు తొడిగి, పుష్పించి, ఫలోన్ముఖం అవుతోంది. వసంతం ప్రవేశించింది. అది ఆ ప్రకృతి సహజగుణము; నిసర్గలక్షణము.

మానవుల విషయంలో ఇటువంటి పరివర్తనం వర్తమానం కావడానికి రెండు కలిసిరావాలి. ఒకటి పురుషకారము; రెండవది దైవము.

ఈ పురుషకారాన్ని, ఈ దైవాన్ని ఇంకోవిధంగా చెప్పినప్పుడు, ఒకదానిని వ్యుత్పన్నత, రెండవదానిని ప్రతిభ అని చెప్పుకోవచ్చు.

ప్రతిభ వ్యవసాయంవలన రాదు. వ్యుత్పన్నతకు వ్యవసాయం ఒక్కటే పద్ధతి. వ్యుత్పన్నత వున్నప్పుడు ప్రతిభ రాణిస్తుంది. తీక్ష్ణం అవుతుంది.

ఈ ప్రతిభ అన్నది అందరిలోను నిద్రాణంగా వుంటుంది. అవ్యక్తస్థితిలో వుంటుంది. దైవం కలిసి వచ్చినవారిలో అది వ్యక్తస్థితిలోవుండి, ప్రయోజనకారి అవుతుంది.

అవ్యక్తప్రతిభులే సహృదయులు. వ్యక్తప్రతిభులు సాహిత్యకారులు మొదలైన సృష్టికర్తలు, జిజ్ఞాసువులు — (Intellectuals)

ప్రతిభతోపాటు వ్యుత్పన్నత కూడా వుండాలి అది పరిశ్రమైక లభ్యం. ఇచ్చట విలోకనం, వివేచన పద్ధతులు.

ఈ లక్షణాలు, ఈ మార్గాలు లేనిచోట ప్రతిభ వుండి, అది దరిద్రుని గృహంలాగా శోభలేక క్షీణించి, జాడ్యగ్రస్తం అవుతుంది.

తెలుగు ప్రపంచం యీ స్థితిలో వున్నదన్నప్పుడు ఎవ్వరికీ కష్టం కలగవలసిన అవసరం కన్పించదు. ఆత్మ అధ్యయన రిరంసువులకు అందరికి ఇది తెలుసు. తెలిసి కూడా బుకాయిస్తామంటే, అది ఇంకో దారిద్ర్యం.

ఇందుకు కారణం మన జిజ్ఞాసువర్గం జడను వడి, ముందుగతి కానలేని స్థితిలో వుండటం. అనగా అప్రతిభము, అవ్యుత్పన్నము అయిపోవడము. విచిత్రం ఏమంటె, ఈ జాడ్యానికి మతము, సంప్రదాయము, పురాసభ్యతలేగాక, అధునాతనభావ ప్రపంచాన్ని అవగతం చేసుకోలేక, పురాతత్వాన్నిగురించి మన్నసలేక, ఈ రెంటికి జరుగుతున్న సంఘర్షణలో వుండికూడా, దానిని అనుభవించి, మథించి, సమ్యక్పద్ధతిని,—సముద్ర మథనం లోంచి అమృతాన్ని సృష్టించుకున్నట్లు—సృష్టించుకోలేక, నిష్ప్రయోజకమైన తిరుగుబాటుతత్వమే నాగరక లక్షణము, అభ్యుదయము అనుకునే వృథాశిల్పం కూడా ఇందుకు కారణం కావడం.

అదే విచిత్రం; ఇప్పటి ప్రతిభాప జాడ్యాన్ని పట్టించి, త్రిశంకుస్వర్గాన్ని అటూ ఇటూ కూడా సృష్టిస్తున్నది. ఈ త్రిశంకు స్వర్గాన్నే వైజ్ఞానిక వైభవంగా భావించేవాళ్లు వుంటే, అది వాళ్లు చేసుకున్న పురాకృత కర్మఫలం అని వూరుకోవలసిందే.

శ్రీ నీరదచౌధురి ఇట్లా వ్రాశారు: "పాశ్చాత్య సంస్కృతి సభ్యతలయొక్కయు, భావ ప్రపంచం యొక్కయు ప్రభావం ఆంగ్లదేశంయొక్క సభ్యతతో, నాగరికతతో కలిసి ఒక రకమైన మానసికమైన అభివృద్ధిని, సాంస్కృతిక అభ్యున్నతిని తెచ్చిపెట్టింది. ఇది ఏదో బలవంతంమీదవచ్చిన, తెచ్చిపెట్టుకున్న పద్ధతి క్రింద తయారైంది. అలాగ ఇది బలుపుగానే కన్పించింది; హఠాత్తుగా వచ్చిన బలుపు వాపుక్రింద పరిణమించవచ్చు. పరిణమించింది. భారతదేశంలో జిజ్ఞాసువర్గం సాధించింది ఏమన్నావుంటే, అది గారడే; అక్కడికి అక్కడ మామిడిచెట్టును మొలిపించి, అక్కడికి అక్కడ కాయలను కాయించినట్లు తయారైంది. ఈ పద్ధతి [illegible] బలుపునకు బదులు అలుపు పుట్టి, అంతా చెడి పోవడానికి మార్గం మాత్రమే ఏర్పడింది......పాశ్చాత్య సాంకేతిక విజ్ఞానం వున్నదంటే, దానిని పాశ్చాత్య ప్రమాణాలతో చూస్తే, అది భారతీయులను మరింత జిజ్ఞాసువులనుగా దిద్దలేదు......భారతీయులకు సంబంధించినంత వరకు ఈ సాంకేతికవిజ్ఞాన ప్రభావాలు ఆ తత్వరహితాలై, పిండిలేని రొట్టెలవలెగా తయారైనాయి. భారత దేశంలో అవి, వానివియైన శాస్త్రీయ ప్రాతిపదికనుంచి విడాకులు ఇప్పించినవవుగా పరిణమించాయి. అనగా శాస్త్రీయ విచారణకు దూరమైపోయినవైనాయి."

ఈ లక్షణాలను ఇప్పుడు దేశంలో సర్వత్రా చూస్తున్నాము. జిజ్ఞాసు జీవితానికి సంబంధించిన సర్వ రంగాలలో ఇవి విద్యమానం అవుతున్నవి. ప్రతిభకు ప్రతిభ ఎండిపోతూ, అకృతపరిశ్రమత్వమే శ్రేయం అయి, అనువాదతత్వం ప్రబలమై, సహజస్థితిలేక, నిసర్గలక్షణం పెంపొందక, కృత్రిమ భావ జగత్తులు ఏర్పడి, గడ్డి ఘట్టించిన వ్యక్తులను, ఏవో అదృశ్యశక్తులు ఆడిస్తున్నవతుగా జిజ్ఞాసువులము అనుకునేవాళ్లు, వారిచేత ప్రభావితు లవుతున్నవాళ్లు కూడా వ్యవహరిస్తున్నారు.

పాతకాలపు విజ్ఞాన సంపత్తే సార్వకాలికమైనదన్న పిడివాదంతో సమాజంయొక్క, జనజీవితంయొక్క సహజఅభ్యున్నతిని అరికట్టుతున్నవాళ్లు వున్నట్లే, ఏదో సిద్ధాంతాన్ని పట్టుకొని, దాన్ని తర్జుమాచేసుకొని, ఆ తర్జుమా సిద్ధాంతంవల్లనే లోకానికి పూర్తిపరిష్కృతి జరిగిపోతుందన్న పిడివాదంతో సహజ లక్ష్యానికి భంజకంగా వ్యవహరిస్తున్నవాళ్లూ వున్నారు. ఈ రెండు వర్గాల సంఘర్షణ, సమన్వయానికిగాక జడిమకు దారితీయడం, మేధాసంబంధమైన దారిద్ర్యానికి గుర్తు.

పిడివాదాలు, పురస్సిద్ధాంతాలు నిజమైన తాత్విక విజిజ్ఞాసకుగాని, మానసిక అభ్యున్నతికిగాని మార్గాలు కావు. పాతపిడివాదాలు ఏవిధంగా అచ్చమైన విజిజ్ఞాసకు విరుద్ధాలో, కొత్తపిడివాదాలుకూడా అదేవిధంగా విరుద్ధాలు. ఈ రెంటి నడుమ బుద్ధి, జ్ఞానం, సమ్యక్ దృష్టి నలిగిపోతున్నాయి.

ఇదీ ఇప్పుడు దేశంలోవున్న పరిస్థితి. దీనివల్ల వస్తూవున్న బాధ ఏమిటో దేశం చూస్తూనే వుంది; అనుభవిస్తూవుంది. దేశం అంతటా ఒకరకమైన అవ్యవస్థ వ్యాపిస్తూవుంది. ఇచ్చట వసంతంలేదు. ఆకు తొడగడము, పూవు పూయడము, ఫలించడము అన్నది లేదు. ఇచ్చట వ్యుత్పన్నులము అవుదాము, ప్రతిభను పండించుకుందాము అన్న ఆలోచనా, కృషీ లేవు. ఆ ప్రతిభ అన్నది ఏమన్నావుంటే అది వక్రిస్తున్నది. అది పండటంలేదు. నీటిపసర్లులేని పంట పొలంవలె అయిపోతున్నది. ఈ స్థితి ఎందుకు సంప్రాప్తమైంది అని ఆలోచిస్తే ముందు దారి ఏమిటో కన్పించవచ్చు. ఆ ఆలోచనచేసే ఓపిక కూడా ఇచ్చట వున్నట్లులేదు.

కొందరు ఈ అవ్యవస్థలోంచి నిర్మాణం జరుగుతుందన్న పద్ధతిలో ఆలోచిస్తున్నారు. వైక్లబ్యాన్ని ప్రోత్సహిస్తున్నారు. లయంలోంచే సృష్టి అన్నవాదం కలవాళ్లుగా వీరు గోచరిస్తారు. ఇచ్చట పురుషకారము, ప్రతిభా కూడా దుర్వినియోగం అవుతున్నాయి.

దేశం నావికుడు లేని నౌకలాగా అయోమయ సముద్రంలో పడి నడుస్తున్నది.

ఈ స్థితినుంచి ఆ నౌకను రక్షించాలంటే జిజ్ఞాసువర్గం మేలుకొని, ఆత్మప్రబోధం చేసుకొని, అసహజస్థితినుంచి సహజస్థితిలోనికివచ్చి, తల క్రిందపెట్టికాక, కాళ్లు నేలమీద ఆన్చి, ఆలోచన అనే నడకను సాధించాలి. అంతా వేదంలోనే వుంది అనే పద్ధతి ఎంత మూఢమో, అంతా ఏదో ఒక సిద్ధాంతంలోనే వున్నదనడం కూడా అంతే మూఢం. కళ్లకు కన్పిస్తున్న పరిస్థితులు ఆధారంగా సమ్యక్ పద్ధతిలో ఆలోచన చేయగల్గితే, అప్పుడు ప్రతిభకు ప్రతిభా రాణిస్తుంది; వ్యుత్పత్తి సాధనయందు నిష్ఠ అధికం అవుతుంది.

ఇది అన్నం తిని అన్నం అరిగించుకొనడంవంటిది. ఇది కానిది అసమఆహారాన్ని భుజించి, అజీర్ణం తెచ్చుకొనడంవంటిది. ఒకటి స్వాస్థ్యము; రెండవది జబ్బు. ఒకటి ప్రతిభావ్యుత్పత్తుల వికసనానికి వసంతము; రెండవది విరుపులేని గ్రీష్మము; ఎడతెగని అనావృష్టి.

మన జిజ్ఞాసులోకం ఈ విషయాన్ని గ్రహిస్తుందా? విచారధారా ప్రపంచంలో వసంతశోభ ఆవిర్భూతికి దోహదకారి అవుతుందా?

ఇదే ప్రశ్న, ఇదే కీలకం.

# షష్టిపూర్తి

## శ్రీ శనగన నరసింహస్వామి

వేలగఁ బార్త్రియయ్యెఁగద యిప్పటి కీవరుదెంచి షష్టి వ
ర్షాలపు డీ వొసంగినది సౌఖ్యమొకాక దురంతదుఃఖమో
తేలిచి చెప్పరాదిపుడు దీనతఁ జెందిన విశ్వధాత్రికిన్
గీలక! వత్సర ప్రవర! కేవలభద్ర మనుగ్రహింపుమా!

మెల్లగ నిష్క్రమించినది
మిశ్రఫలం బొసగూర్చి కించి దు
త్ఫుల్లవిషణ్ణ వక్త్రరుచి
తోడఁ బ్లవంగము విప్లవంబులన్
దల్లడమందఁజేసి జన
తామతిఁ దచ్చరణాంకితోర్విపైఁ
జల్లఁగఁ గాలు మోపితివి
సర్వశుభంబులు గుమ్మరింతువే!

కోకిల కాకలీధ్వనులకున్ జెవియొగ్గక దక్షిణానిల
స్వీకృతికోస మంజలి రచింపక కష్ట చతుష్పథంబునన్
మూకత నిల్చి దిక్కులు కనుంగొన సాగిన మానవాళికిన్
వి కనుదోయి వెన్నెలల విక్కపుమార్గ మెఱుంగఁజెప్పుమా!

అరువదిమంది సోదరుల
నట్టి కుటుంబమువాడవైన నీ
పరువును సంశయించుటకు
భావము సమ్మతిఁ జూపఁజాల ద
బ్బురమగు నీ వయస్సు నను
భూతి విశేషములెంచి నీకు మా
కొఱకయి మేమె స్వాగతముఁ
గూర్చితి మెట్లు దయన్ వెలార్తువో!

సభ లొనరించి సత్క్రతులు సల్పి యథావిధిగాగ నీకు మే
మభిరతి "షష్ట్యపూర్తి" సుమహంబు ఘటించితి మింకముందు
విభవము సెల్లఁగాక! పృథివీతలమందు క్షణక్షణంబు మా
కభయ మొసంగుఁగాక! భవ దప్రతిమాన గుణప్రతానముల్

# ఉగాది గీతావళి

## డా. బొడ్డుపల్లి పురుషోత్తం

శ్రోతలకున్ మిన్నగా జాతి హితముగూర్చు
సార సారస్వతమ్ము ప్రశస్తి నందఁ
గాంక్ష చేసె మహాకవి కాళిదాసు
చిర తపస్సుగ దాని రక్షింప నోపు.

కుల మతమ్ముల పేర సంక్షుభిత మగుచు
ఆత్మ నాశమ్మునకును ఆయత పడిన
భరత జాతికి విశ్వభావమ్ము, ప్రగతి
ఎపుడు చేకూర్చునదియు సాహితియె సుమ్ము!!

ఎవఁ డనుద్వేగకరమును, హితము, ప్రియము,
సత్యమైన వాక్యము నుపాసన మొనర్చి
సతము స్వాధ్యాయ నిరతుఁడౌ, అతఁడెయగును
వాఙ్మయ తపస్వి, గీత చెప్పంగ వినరొ!'

శూన్యమతులైన కవుల వాఙ్మయము పొగసు;
జనుల వాడుకలోని భాషా విశేష
మహరహమ్ము నేకాగ్రత నరయు విబుధ
మండనుఁడు వాదు దృష్టి వాఙ్మయ తపస్వి.

నరు డశీతి బోధాచరణ ప్రచార
ములను క్రమముగఁ గల్గి సంపూర్ణుఁడగుట
కుద్యమింపంగ వలయు నత్యార్జితముగ,
అపుడె జీవిత మానంద యాత్ర యగును.

సకల ప్రకృతితోడ సామరస్యంబును
గలిగి బ్రతుక నేర్వవలయు నరుఁడు,
అవసరమ్ము పట్ల నఖిల విజేతగా
చాటి చూపవలయు శౌర్యమహిమ.

కళల కన్నిటఁ దలమానికముగ నెగడు
కళ జగమ్మున జీవితకళయె గాన
దాని సంతత మేకాగ్రతను భజించి
తత్కళాపూర్ణులై ప్రజల్ తనరవలయు.

చేతనా చేతనముల సంస్థితి వహించి
ప్రకృతి సర్వమ్ముఁ బులకాంకురముగఁ జేయు
ప్రణవ మంత్రమ్మునే యుపాసన మొనర్చి
యమృత పుత్రులు కావలె నఖిల జనులు.

అఖిల భోగానుభవ సమగ్రానుభూతి
భవ్య వాత్సల్య జనితమౌ ప్రమదమంది
చరమ జీవితమందు వాంఛల జయించి
స్వీకరింపంగనొప్పు నివృత్తి సుఖము.

బుద్ధదేవుఁడు, శంకర పూజ్యపాదుఁ
డేసుక్రీస్తు, మహమ్మదు నేకరీతి
మాననీయులె యీ నాటి మానవులకు.
భావభేదమ్ము కూడ దెవ్వారిపట్ల.

ఆర్యఋషికున్న విమల విశ్వాత్మదృష్టి,
శాక్యముని కున్న కరుణావిశాలహృదియు,
శంకరజగద్గురుని సుఃశక్తి యుక్తి
యున్న వాఁడెపో!! భారతీయుం డనంగ.

కర్మ భూమి యంచు కాంచె ప్రఖ్యాతిని
భరతభూమి యీ ప్రపంచ మందు,
అట్టి పుణ్యభూమి నావిర్భవించిన
[illegible] భాగ్యశాలి వీవె.

స్వచ్ఛమైన వాక్కు, అచ్చమౌ హృదయమ్ము,
తిన్ననైన నడ, ప్రసన్నమతియు,
నీతి, నియమములును, పూత చరిత్రమ్ము
ఈ తెలుగుజాతి ఘనత నిల్పు.

ఉత్తరాదివార లుద్రిక్తులు, మనీష
వాడి దక్షిణాది వారలందు,
నిశిత మేధతోడి నిర్మల హృదయమ్ము
కల తెలుంగు వారి కలిమి, కలిమి.

శిల్పి, గాయకుండు, చిత్రలేఖకుడును,
కవియు, తత్త్వవేత్త గాగ నీవె,
సకల శాస్త్ర మహిమ సమకూరె నీకున్నై
ఆక్రమింపుమీ! త్రివిక్రముడుగ!!

ద్వైతి వగుదువు దేహ భావమ్ము చేత,
జీవిగా నీశ్వరాంశ విశిష్టుఁ డగుదు,
ఆత్మభావన నద్వైతి వగుదుకాన
ద్వైత మద్వైతముల నిట్లె వలయు తెలియ.

వలయు నద్వైత సిద్ధి భావమ్ము నందె,
తగదు పాటింపగా క్రియాద్వైత మెపుడు,
ద్వైత మద్వైతములఁ గల్గు ప్రాభవముల
వ్యక్తి గుర్తించి ధన్యత బడయు టొప్పు

విశ్వభావనమ్ము, విశ్వజనీనమౌ
నిశిత దృష్టి, తీర్పు, నేర్పు, వడసి
అఖిల మతములందు, అన్ని ధర్మమ్ముల
గౌరవ గల్గి సత్య మరయు మోయి!!

ఆ మహాత్ముఁడు గాంధి సత్యమ్మునందు
చిరతర తపస్వి యరవిందు శివమునందు
అల రవీంద్రుని సుందర విలసనమున
భక్తి విహరింపు స్వేచ్ఛగా భరతపుత్ర!!

అరయ సత్యమ్మె, శివము, సుందరము నగును:
సుందరమునె, సత్యము శివ మందు రార్యు
లట్లె శివము, సుందరము, సత్యమ్ముగాగ
సత్య శివ సుందరములు నిజాని కొకటె.

మనసు, వాక్కు, కర్మలను త్రికరణముల
మనసు, సత్య భావమయముగాగ
కర్మ, శివమయమ్ముగా సాగవలయును;
వాక్కు, సుందరముగ వరల దగును.

జ్ఞానశక్తి యఖండమై సత్య మొసఁగు
స్థిరతరమ్ము క్రియాశక్తి శివముఁ గూర్చు
సురుచిరేచ్ఛాను శక్తి సుందరత నిచ్చు
నీవెగా త్రిమూర్తివి! త్రివేణివి!! యొఱుంగ

మాదు ధీశకి దేవా! ప్రచోదితమంయి
భద్ర భావాళితో జగద్వ్యాప్త మగుత॥
సకల మానవ మానస సరములందు
సత్య శివ సుందరాబ్జ ప్రశస్తి యగుత!!

మాకు తేజస్సు గూర్చు, నమస్కరింతు!
మాకు నోజస్సునిమ్ము నమస్కరింతు!!
మాకు వీరమ్మొసంగు నమస్కరింతు!!!
ఏడుగడ నీవు మమ్ము కాపాడు దేవ!!

# కీలక స్వాగతము

## శ్రీ బెళ్ళూరి శ్రీనివాసమూర్తి

ఎన్ని పరివర్తనములొందె ఋతు వితాన మెన్ని సుఖదుఃఖములు వర్తించిపోయె
కాలచక్ర భ్రమణ లీల కనులువిప్పి కాంచుచున్నాడు మనుజు డగాధ సృష్టి!

నీకున్ స్వాగతమిచ్చెడిన్ మధురవాణిన్ బిల్చి వాసంత శ్రీ
లాకౌతూహలవృత్తి కోకిలము — నీ లావణ్యముం జల్లి యీ
లోకంబెల్ల హసన్ముఖోజ్జ్వలముగా రూపొందగా జేతువో
నీకై వేచెను డెందముల్ ముదమునన్ నిండింపవే కీలకా!

అది నిరుపేద యేడ్పు, హృదయ ద్రవమై స్రవియింపసాగె నే
కొదవలు వానియుంట కనుగూర్కగ నీయవొ — పూరిపాకల
భ్యుదయ వికాసముం బొరయవో నవమోహనతావకీన దృ
ఙ్మధు కలశమ్ము జల్లి యొక మంజుల శోభ వెలార్పు కీలకా —

అదిగో కర్షకమూర్తి — దీప్తిదిగు సాయాహ్నంబుగా దోచుచున్
చదలన్ చూడ్కినిగుడ్చు మేఘము నిరాశావాలగా తూలగా
వెదలో గ్రుంగు — విలంబ మేమిటికి రావిమ్మింక కారుణ్య సం
పదకున్ తావలమైన నీ సుముఖభావప్రావృడంభోదమున్!

కనుగొలకుల్ విషాద జలకమ్ముల నార్చు జగద్ధితైక శీ
లిని దిలకింపు మెన్నడు చలింపని స్వీయహృదంతరమ్ము కా
ల నియతి దూల — దుర్భర జరాభర దూషితమైన జీవిత
ధ్వనుల లయింప, శిష్యతతి దాపునజేర్చి సుబోధ సల్పెడిన్

అతి విస్తరముగ లోకపు గతి దెలుపగనేల కీలకా, సర్వము నీ
మతి కెఱుకపడిన విషయమె బ్రతికింపుము, తుదిని జూచు బ్రదుకులవెల్లన్

లేదు, నిజమ్ము విన్నడుగ లేదు మహత్తర రాజభోగ వాం
ఛాదులు — పూర్వ సంస్కృతి తనంతనజారి యధర్మవృత్తి లో
కాదర పాత్రమైన చెడుకాలము గన్గొన భారతోర్వరా
శ్రీ దురితాత్మకుల్ చెఱచు రీతి సహింపనిదయ్యె కీలకా!

వినబడె కీలకా, చెవుల విందుగ నీ రథ నిస్వనమ్ము తద్
ధ్వనులు దిశాముఖంబులకు దాకిన, ప్రాణము లేచివచ్చె, నీ
యనుపమ వత్సలత్వమున కాత్మసమర్పణ మాచరింత్రు, క
మ్మని గళమెత్తి పాడి నిను మార్గమునన్ గని పత్కవీశ్వరుల్
విను నవాబ్ద మటంచు మన్నించి కొల్చి ప్రజలు నీరాజనముబట్టి భక్తి పరత
స్వాగతము పల్కువారు — ప్రక్షాళనమ్ము సేయవే పాపపంకిల క్షితి —యశస్వి!

# ఉగాది

## శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి

శ్రీ స్వయంప్రకాశంలో లావణ్య దీపం
నిప్పున వెలిగిన క్షణానికీ.
మింటి చీకటి తెరపై మెత్తగా, చల్లగా చాంద్రీతోరణం
ప్రేలిన సమయానికీ,
విరాళా కోర్కె నీరవ ప్రపంచంలో మధు కంఠంతో
మ్రోగిన కరుణాపికీ,
మ్రోగే ముంగిట పచ్చని ముగ్గు మెరిసిన నిమిషానికీ,
వ్యథిత హృత్ శిరస్సుల మీద అదృశ్య దేవతలు
పూల దీవెనలు వర్షించిన దినానికీ,
రెక్క విప్పిన వెచ్చని వెలుగుకీ,
దివ్వె పట్టనక్కరలేదు—
వర్ణించి చూపించ నక్కర లేదు—
పసి మనస్సుకీ ఇదిగో ఇదియని విప్పి చెప్పనక్కరలేదు—

* * *

అశోకు డెక్కడ చెట్లు నాటించిందీ
ఎన్ని శాసనాలు వేయించిందీ,
స్వర్ణయుగాలు ఎవరెవరు వెలిగించిందీ,
చరిత్ర ఏమి బోధించిందీ,
సైన్స్ ఏమి సాధించిందీ,
మనది పురోగమనమా, లేక తిరోగమనమా,
మన దేశం మన గొప్పతనం, మన శిల్పాలు, మన శిథిలాలు,
నీతీ, నిజాయితీ, న్యాయం, ధర్మం
వీటి వేటిని గురించీ ఉపన్యసించ నక్కరలేదు—
ఇప్పుడు—

* * *

ఇది చెప్పు
ప్రతి మనిషి మనస్సులో ఉత్సాహం పచ్చని కొమ్మై,
ఊగుతుందెప్పుడు?
ఇది చెప్పు

అడుగడుగునా వాడుమొగంతో తగిలే సాదామనిషి కళ్లల్లో
హాయిగా చిరునవ్వుమువ్వ టింగున మోగుతుందెప్పుడు?
ఇది చెప్పు
ఏ మంచి ఉషస్సులో, ఈ మిన్నంతా నిండి మానవతాపతాకం
మెత్తగా మెరుస్తుందెప్పుడు?
ఆనాడు పువ్వు పువ్వుగా తోచిన రోజు-
ఆనాడు నువ్వు నువ్వుగా విడిచిన రో
అది కొత్త పాటకి పునాది
అది మానవజాతి తలపై ఆహ్లాద మణికిరీటం, వికసించిన యుగాది
అది ప్రతి ప్రాంగణంలోకి వాసంత సమీరం ప్రసరించిన ఉగాది!

# కీలకమ రమ్ము రమ్ము మమ్మేలుకొనఁగ!

## శ్రీ అయ్యగారి నరసింహమూర్తి

కల్లు ద్రావిన మత్త మర్కటము రీతి
వికృత చేష్టల జనులను వెతలఁబెట్టి
పరిహసించెను, పఱచె ప్లవంగ వత్స
రమ్ము సార్థక నామధేయమ్ముతోడ

నీదు రాకను గనినంత మోదమంది
వింత సోయగములతోడ విరిసె ప్రకృతి
కూర్మితో గీతికలు పాడె కోకిలమ్ము
కీలకమ రమ్ము రమ్ము మమ్మేలుకొనఁగ.

కీలకమా! నీదు నాలకమ్మునుజూచి
వడవడి యిది యని నుడువలేము
కాలకమ్మును బట్టి వా డిట్టి వాఁడని
కలియుగమ్మున బల్కవలనువడదు
క్రొత్త మనుచుఁ బ్రాత, హాయినిచ్చును గ్రొత్త
యనియెంచి పులకించి నినుఁదలంచి
కాఁదు వారికి పోలె మోదమ్ముతో నీకు
స్వాగత వచనాలు సలిపినాము
మమ్ముచేరి మాకు నిమ్ముగ భాగ్యమున్
తెచ్చి యిత్తువో మరి ముచ్చుపోలె
ఉన్నదంత మ్రింగి యూరకే పోదువో
చూడవలయు నీదు జాడలింక.

కూఁతుఁగం టోఁదల్లి కొద్దియో గొప్పయో
మంచి దవెడి యొఱక మాకుఁ జేసి

లోలకమ్ము రీతి కీలకవా, నీవు
తల్లడిల్లఁజేసి తరలిపోదా!

ఏది యేమైనగాని నీ యుచ్చుతోడ
కలసిరావలె మా భాగ్య కలన — ఇంక
మేలు గలిగిన మనములు హేలతోడ
శ్వాస విడుచును హాయిగా శ్రాంతినొందు

# వసంతోదయము

## శ్రీ రేవూరు సుబ్బారావు

ప్రశమిత విహారకాంక్షన్
శిశిరర్తువు సనియె, నది శిఖరాగ్ర తుషా
ర శిలాకర్కశ పల్యం
కశయన విశ్రాంతిఁ గోరి, కదిమిన ముదిమిన్!

ముసురుగఁ బైపయింగురిసి మూఁగియలంచెడి మూడమంచుచే
వసుమతి నాడిపత్త్రలయి పన్నెలఁ బాసిన పండుటాకులన్
విసుఁగున రాల్చుచున్ గృపణ ప్రవృత్తిఁ దోఁచు లతాద్రుమాదు లు
ల్లసిల వసంతుఁ డద్భుతకళాకుశలుం డరుదెంచె నల్లనన్.

వచ్చి వసంతుడు లోకము
సచ్చిరువునఁ జూడఁ గిసలయంబులఁ బూవుం
గుచ్చులు శుభసూచనలై
నొప్పువడన్ నింబతరువులందు సృజించెన్.

చాంద్ర సంవత్సరాది ప్రశస్త పర్వ
దివసశుభలాంఛనములయ్యె ధవళ కుసుమ
మాలికాశ్రేణి లరుణాంశుజాల భరిత
పల్లవము లొప్పఁ బిచుమంద పాదపములు.

నవ గోమేధిక పద్మరాగమయ వర్ణస్నిగ్ధ వాసో గృహ
ప్రవితానంబులమర్చి ముత్తియపుఁ జేర్లంగప్పె నొక్కొ వసం
త విభుం డుత్సవకేళి నెల్లెడఁ బ్రమోదంబారఁ గ్రీడింప నాఁ
జివురుల్ గ్రొవ్విరులొప్ప నింబతరువుల్ జెన్నారఁ దోఁచెన్ ధరన్.

చిగురుటాకులు పసలుఁ గ్రొంజిగురులెలర్పఁ
బొదలుఁ దీవెలు మ్రాకులుఁ బొటకరించె

సుజ్జ్వలంబైన యవ్వనంతోత్సవమున
కెలిమిఁ గైసేసికొనియున్న చెలువుదోప
మత్తుగొనఁ జిత్తమానంద మధువుఁ గ్రోలి
కనులఁ గాంచని దివ్యలోకములఁ దిరుగఁ
జేయునెత్తావులెగయ బూచె రవి గ్రుంకు
సంజలం దొగి నవమనోరంజనములు.

సీతనుగూడి తాను మును జేసిన కీడునకేవగించి రో
షాతిశయంబునన్ దన సహాయముఁ గోరని ప్రాణులన్ బ్రమో
దాతతమైత్రి దన్పఁ బ్రియమారఁ బ్రసన్నతనూనెనో యనన్
శీతహిమాణుభారమున వెల్వడి గంధవహుండు సౌమ్యుడై!

# పోకడ - రాకడ

## శ్రీ చర్ల సత్యనారాయణ

ఓ ప్లవంగము! యీ భరతోర్విమీద
నీవు గడపిన పదిరెండు నెలలుగూడ
నరుల నెల్లర బలిమి వానరులఁ జేసి
పేరు నిలబెట్టుకొంటివి వెళ్లిరమ్ము.

భారతదేశ మెల్లెడ ప్లవంగ యొనర్చిన చేష్టలెల్ల దు
ర్వారములయ్యెఁ; నేతలు పరస్పర మత్సర పూర్ణచిత్తులై
పౌరుల నెవ్వడుంబడని పాటుల పాల్పడజేయుచుండ నీ
దారుణ చర్య కంతకు బ్రధానవు గీలక మింక వెల్వడున్.

దేశమును తప్పుతోవకు ద్రిప్పజాలు
గోముఖ వ్యాఘ్రములబట్టి కూలద్రోసి
ఘనత వహింపదగు కీలకంబు దెలుప
వచ్చె కీలక నామ సంవత్సరంబు.

పాలకులు, బాలకులుగూడ పట్టుదప్పి
దేశదౌర్భాగ్యమును గోరితెచ్చినారు
వారి యాటలు కట్టించి వారి వారి
కీలెరిగి వాత పెట్టుమీ! కీలకంబ!

## నాటిక

# సుహృత్ సుదామము

శ్రీ నోరి నరసింహ శాస్త్రి

### ప్రథమ రంగము

[సుదాములవారి కుటీరము-ఆవల పలువురు పిల్లల ఆక్రందనాలు--హీనస్వరాలతో వేదపాఠాలు వల్లెవేస్తున్న విద్యార్థుల కంఠాలు. సుదాములవారు ఆనందం విరిసిన ధ్యానముద్రతో తెర ఎత్తేసరికి ప్రత్యక్ష మౌతారు.]

(కాపులు ప్రవేశము)

కాపులు అంతా ఒక్కసారి : దణ్ణాలు బాబులూ, దణ్ణాలు.

సుదాములు: (ధ్యానభంగమై తల ఎత్తి) ఏం నాయనలారా ?

పెద్దకాపు : వరసగా నాలుగేళ్ళబట్టీ భూములలో ఒక్క గింజ కూడా పండడంలేదు, బాబూ !

సుదాములు : భగవదిచ్ఛ ! మీకు ప్రాప్తంలేదు.

చిన్నకాపు : పండిన రెండుగింజలూ ఖర్చులకు కూడా చాలడం లేదు బాబయ్యగారూ !

సుదాములు : అయ్యో, పాపము ! మీ రెంత బాధపడుతున్నారో గదా !

చిట్టికాపు : అదే బాబయ్యగారూ!—అమ్మగోరు—

సుదాములు: ఏమిటి ?

బుల్లికాపు : అమ్మగారే, బాబుగారు ఇబ్బంది పడుతున్నారు, ఈయేడు పండిన పంటలో సగమైనా ఇయ్యమని కబురు పెట్టిందు బాబయ్యా !

సుదాములు : అయితే సగమియ్యలేక పోయినారా, పోనీ.

పెద్దకాపు: అయ్యయ్యో—సగమా, అయ్య బాబయ్యో? చూడండి మా పిల్లలంతా అన్నానికి కరువు వాచి ఉన్నారు. గంజి కూడా తాగడానికి లేదు బాబయ్యా ! — సగము ఎట్లా ఇచ్చేము ?

సుదాములు : పోనీ పాతికైనా ఇయ్యక పోయినారా ?

చిన్నకాపు : (పెద్దకాపుతో రహస్యంగా) ఒప్పుకోరా, ఒప్పుకోరా, అమ్మగారు వస్తుందేమో !

చిట్టికాపు : (పె.కా.తో రహస్యంగా) ఒప్పుకొందాము. పాపము, బాబయ్యగారికి ఇల్లు గడవడం లేదు. లేకపోతే అమ్మగోరు కబురంపదు.

బుల్లికాపు : (పె.కా.తో రహస్యంగా) ఒప్పుకోరా, బాబయ్యగారు అడిగితే భగమంతుడే అన్నీఇస్తాడు, ఒప్పుకోరా !

చిన్నకాపు : (పె.కా.తో రహస్యంగా) అవునురా. బాబయ్య ఇంత కబురుచేస్తే కిష్టయ్య పెబువుపేనలు మన ఇళ్ళవిగాడికి పంపించి మనము దాచుకున్నదంతా బయట పారే యిస్తాడురోయి, ఒప్పుకో !

పెద్దకాపు : (కాపులతో రహస్యంగా) ఊరుకోండిరా, మీకేం తెలియదు కాని—(సుదాములతో) బాబయ్యా, ఖర్చులకే చాలకపోతే పాతిక ఎట్లా ఇస్తాము ! పరకకూడా ఇయ్య లేము— పొలాలు వదిలి లేచిపోదా మనుకుంటున్నాము.

సుదాములు : అయ్యో, పాపము, మీ కెంతకష్టము వచ్చింది!

పెద్దకాపు : అదే బాబయ్యా, మేముగనక వదిలి పెట్టిపోతే పొలాలు బీళ్ళయి పోతవి. దేవుడంటి బాబయ్యగారి పొలాలు అన్నీ పాడయిపోతవి, అని విడిచి పోలేకుండా ఉన్నాము. బాబయ్యా !

చిన్నకాపు : (రహస్యంగా) అమ్మగారు వస్తుందదిరా, ఏదో పాతికకో పరకకో ఒప్పుకోరా !

చిట్టికాపు : (రహస్యంగా) ఒప్పుకోరా !—అదుగో రానే వచ్చిందిరా అమ్మగోరు !

బ్రాహ్మణి : (ప్రవేశించి) ఇస్తామన్న ధాన్యం తెచ్చారా ?

[కాపులు ఒకరి ముఖాలు ఒకరు చూచుకుంటారు]

బ్రాహ్మణి : ఏం, మాట్లాడరేం ?

సుదాములు : వాళ్ళ పంటలు పండలేదంటున్నారు, పాపము !

బ్రాహ్మణి : పంట తరిగినమాట నిజమే కాని పండలేదనేమాట అబద్ధం— పండిన పంటలో సగమిస్తామని చాలామంది ఒప్పుకున్నారు.

పెద్దకాపు : ఎవరమ్మా తల్లీ ఆ వెధవలు ?

[చిన్నకాపు చిట్టికాపు నెమ్మదిగా జారుకుంటారు]

సగంపంట ఇస్తే మా ఖర్చులు ఎట్లా గడతవి? చేసిన అప్పు లెట్లా తీరుతవి? మళ్ళీ పంటవచ్చేదాకా మేమూ మా పిల్లలూ బతికేదెట్లా?—అయ్యో !

బ్రాహ్మణి : ఇదుగో, మీ దొంగమాటలు కట్టిపెట్టండి. ఇస్తే మర్యాదగా ఇయ్యండి ఒప్పుకున్నట్లు. లేకపోతే, శ్రీకృష్ణునికి మీ బాకీలన్నీ అప్పచెపుతా. అతనే పిండి పిసాలు చేస్తాడు అంతా !

[కాపులంతా గోడుగోడున ఏడుస్తారు]

ఒకరు : అయితే మేమీ ఊరువిడిచి పోతామమ్మా! ఏవా పొలాలు మీరే పండించుకోండి తల్లీ!

ఒకరు : మా పిల్లా బిడ్డలం పై గుడ్డలతో లేచిపోతాం!

ఒకరు : ఆ శ్రేష్ఠినే పండించుకో నివ్వమనండి.

సుదాములు : పాపము, వాళ్లను వేధించడం మంచిదా ?

[మళ్లీ కాపులంతా బావురుమని ఏడుస్తారు]

బ్రాహ్మణి : వీళ్ల ఏడుపులు నమ్మబోకండి—సగంపంట ఇస్తామన్నవాళ్లు ఇందాక ఉన్నారు ఇప్పుడు జారరే, ఏరీ?

పెద్దకాపు: ఎవరమ్మా, ఏరీ వాళ్లు? నేనుగదా పెద్దకాపును! నేను ఒప్పుకొన్నానా తల్లీ, చెప్పండి!

బ్రాహ్మణి : నీవుకాదు. (ఒప్పుకున్న వాళ్ల కోసము కలయ చూస్తుంటుంది.)

పెద్దకాపు : ఎవరో మమ్మల్ని అల్లరిచేయడానికి, నాశనంచేయడానికి, అని ఉంటారు! వాళ్లు అసలు పొలాలుచేసేకాపులేరా — కూలీ లయ్యుంటారు. మేము పొలాలు వదిలి పెడితే తాము చేసుకుందామని కాచుకు కూచున్నవాళ్లు!

సుదాములు : పోనీ పాపము, వీరాకు నష్టంగా ఉందిగా, వదలండి. పాపము, ఆ పేదకాపులే కష్టపడి వ్యవసాయం చేసుకుంటారు!—వాళ్ల పొట్ట బాగుండదే ~!

[పెద్దకాపు తెల్లవోయి కాసేపు నిశ్శబ్దము. కాపు లతనితో గుసగుసలు]

ఒక కాపు : ఒరే, పాపము సగమిద్దామురా!

ఒక కాపు : ఒరే, నిన్ను పెద్దకాపును చేసుకొన్నందుకు ఇంత తెలివితక్కువగా వ్యవహరించా వేమిరా ?

బుల్లికాపు: అదే అంత ఏడుపుకొన్న జ్ఞానికే, నీ దొంగవేషము కనిపెట్టడము ఒక కష్టమటరా ?

బ్రాహ్మణి: ఏమిటా గుసగుసలు! దొంగ పోకడలు పోక, ఒప్పుకొన్న ధాన్యం తీసుకురండి!

పెద్దకాపు: అమ్మా—అయ్యా—అట్లా అనకోవాకండి.

బ్రాహ్మణి : ఏం ?

పెద్దకాపు : కట్టిన ఇంట్లో, నా కట్టుకున్న పెళ్లాం సాక్షిగా, నా పిల్లలు సాక్షిగా చెబుతున్నాను నేను అబద్ధమాడితే - నా పిల్లలంతా నాశనమైపోవాలి!—

బ్రాహ్మణి : (బాధతో) అంతంత ఒట్లు వద్దురా, నాయనా!

పెద్దకాపు : పిల్లలు నాశనమై పోవాలె అబద్ధమాడితే ఆ వెధవ కూలివాళ్లకే అప్పగించి మా దారిన మేము పడితే, వాళ్లేమి చేయగలరు తల్లీ, వ్యవసాయము! గొడ్లా, గోడా? అరకలుకూడా లేవు. విత్తనాలు ఎక్కడ తెస్తారు? వాళ్లకు, తాడగా బొంగరం లేనివాళ్లకు, అప్పు పెట్టే వాళ్లుకూడా ఉండరే!—అయ్యో, నిక్షేపంలాంటి మీ భూములు పాడైపోతవే!—బంజర్లయి పోతవే—ఎందుకూ పనికిరాకుండా చవుడేసి పోతవే—పాపము, రాజులు రాణులలాంటి మీ పిల్లలు అవో లక్ష్మణా అంటూ ఘోష పెడితే—మా కేమి పుణ్యం ఉంటుంది తల్లీ—అందుకు బాధ పడుతున్నాము తల్లీ!

[అతనితోపాటు కాపులంతా లబ లబా ఏడుస్తూ మొత్తుకుంటారు.]

బ్రాహ్మణి : (ముఖంలో జాలి చూపుతూ మెత్త పడుతుంది.) శ్రేష్ఠి మీ మాటలు నమ్మవద్దన్నాడే, మీ దొంగ ఏడుపులకు మోసపోవద్దన్నాడే.

పెద్దకాపు : అవునమ్మా, ఆ శ్రేష్ఠి అట్లాగే అంటాడు. అంతేనా? అతను తినేదంతా నెత్తురుకూడాయె—మిమ్మల్నికూడా మా నెత్తురు పిండుకుని తాగమంటాడు—(కన్నీళ్లతో) అయ్యో, చూడండమ్మా, కోసినా నెత్తురుకూడా రాదు.

[కొడవలి తీసుకొని పదునువైపు చేతిమీద పెట్టుకుంటాడు.]

బ్రాహ్మణి : (తెల్లవోయి) ఆ పాపము మాకు వద్దు నాయనలారా—వద్దు, ఊరుకో తండ్రీ!—నా కన్నబిడ్డలు అన్నంలేక మాడుతూఉంటే చూడలేక, మిమ్మల్ని పిలిపించాను. నాయనా!—(కన్నీళ్లతో) ఏమన్నా ఇయ్యగలిగితే, ఉంచే నాలుగు గింజ లియ్యండి—మీకు పుణ్యముంటుంది!

[కాపులు గుసగుసలు]

బుల్లికాపు : పాపము సగమిద్దామురా!

మరొక కాపు : వాళ్ల ఘోష మనకు కొడుతుందిరా!

మరొక కాపు : అమ్మగారు కన్నీళ్లు పెడుతుంటే లంకలో ఉన్న సీతామ్మవారల్లే ఉందిరా.

మరొక కాపు : ఏదో కొంత పంటైనా ఇయ్యకపోతే ఎట్లారా ?

పెద్దకాపు : (వాళ్లతో రహస్యంగా) నోరు మూయండి, మీ జాలీ మీరూను—నాకు వాదులా చెప్తారా? (ప్రకాశముగా) అమ్మా, ఎంతమాటన్నారు! మీ పొలంలో పండితే గింజలు మీకు ఇయ్యడమే మహదానమా? అయ్యో, కావలెనంటె మీరే వచ్చి మా పాడు ఇళ్లు చూచుకోండమ్మా! ఒక్క గింజఉంటే—నా పెళ్లాం తోడు, నా పిల్లలు నాశనం కావాలె- ఉంటే ఇయ్యమా ?—అంత పాపిష్ఠులమా ?

సుదాములు : (ఇంతసేపూ పరధ్యానంగా భగవద్ధ్యానం చేస్తూ ఉండి ధ్యానభంగమై) బ్రాహ్మణీ, వీరంతా ఎందుకో ఏడుస్తున్నారు చూడు!

[కాపులంతా మరింత ఏడుస్తారు. ఏడుపులు.]

బ్రాహ్మణి : పోనీయండి, నాయనా—మిమ్మును ఏడిపిస్తే మీ పెళ్లాం బిడ్డల ఘోష మాదికాదా! మా పిల్లలవంటి వాళ్లే మీ పిల్లలూను-అంతేకదా!

పెద్దకాపు : అరె, అరె శ్రేష్ఠి వస్తున్నాడ్రోయ్, పదండి, ఏడవండి, ఏడవండి !—

[అంతా ఏడుస్తూ అడావిడిగా నిష్క్రమిస్తారు.]

శ్రేష్ఠి : (ప్రవేశిస్తూ) దణ్ణాలు బాబయ్యగారూ, దణ్ణాలు తల్లీ !—కాపులు వచ్చిపోతున్నారు. ఏమిస్తామని ఒప్పుకున్నారు తల్లీ !

బ్రాహ్మణి : (కళ్లనీళ్లు పెట్టుకుంటుంది) నాయనా శ్రేష్ఠీ ! వాళ్లంతా కరువుతో మలమల మాడిపోతున్నారు, చూడు. ఏమిస్తారు !

శ్రేష్ఠి : ఇంతకూ ఎంతకు ఒప్పుకొన్నారు ? సగము పంట ఇస్తామన్నా రంటేరిగదా !—సగమిచ్చినా మీ అప్పులన్నీ తీరిపోయి మీకీ సంవత్సరము ఏదోవిధంగా గడిచిపోతుంది

[సుదాములు బ్రాహ్మణి కొంతసేపు మౌనము.]

సుదాములు : వాళ్లేమి ఇయ్యగలరు, నిరుపేదలు !

శ్రేష్ఠి : ఏమా, కావలసినదంతా ఇయ్యగలరు

బ్రాహ్మణి: అట్లాకాదు శ్రేష్ఠీ! అసలే కాలుతున్న వాళ్ల పొట్టలు కొట్టితింటే మాకు మాత్రము కడుపులెట్లా నిండుతవి!-పాపము !—

శ్రేష్ఠి : అమ్మా, అమ్మా, వాళ్లంతా దొంగలు—మీరుకూడా గ్రహించలేరా ?

బ్రాహ్మణి : వాళ్లమీద మనము దయ చూపవలె. అట్లా ఏడుస్తుంటే జాలివేసింది. అడగడానికి కూనాత్మురాలికి నాకే నోరు రాలేదు—ఎట్లా?

శ్రేష్ఠి : అయ్యో, అయ్యో, అదంతా దొంగఏడుపు, తల్లీ !

బ్రాహ్మణి : ఎవరుమాత్రము ఊరికే ఎందుకు ఏడుస్తారు, శ్రేష్ఠీ! నీ ఋణాన పోములే—ఎట్లాగో ఎప్పటికో నీ ఋణము తీర్చుకోక పోము, భయపడకు !

శ్రేష్ఠి : అయ్యో తల్లీ! మీరుకూడా నా బాకీకి తొందరపడుతున్నాననేనా? నా ధనమంతా మీ పొలాలలో ధాన్యాలతో వ్యాపారం వల్లనే వచ్చింది. మీరొక గింజైనా ఈ ఏడు కలప నందునే నా వ్యాపారమూ మందగించింది. నా సంపద అంతా మీకు సమర్పించుకున్నా కృతార్థుణ్ణే అవుతాను !—

బ్రాహ్మణి: నాయనా, శ్రేష్ఠి, నీకు మా మీదఉన్న భక్తిచేత అట్లా అనిపిస్తుంది కాని, పాపము, వాళ్లగోడుచూస్తే కడుపు తరుక్కుపోయింది— నా కన్నబిడ్డలు ఆకలితో అలమటిస్తుంటే ఎట్లా కడుపు తరుక్కుపోతుందో, వాళ్లను చూసినా అట్లాగే ఉన్నది నాయనా!

శ్రేష్ఠి : అమ్మా, మీరుకూడా అట్లా అంటే ఏమి చేసేది, చెప్పండి.

సుదాములు : (ఆనందము విరిసిన ముఖంతో) కృష్ణా, గోపాలకృష్ణా, బలరామకృష్ణా !—

శ్రేష్ఠి. (తక్కువ కంఠంతో) అమ్మా, మాట్లాడ బోకండి. బాబుగారిని చూడండి. వారి ముఖమేమిటి, ఆపాదమస్తకము ఆనందం వెల్లివిరిసింది. భగవంతుణ్ణి తలుచుకుంటున్నారు.

బ్రాహ్మణి : అవును శ్రేష్ఠి ! వారికి చింతే లేదు. ఆ గోపాలకృష్ణుణ్ణి తలుచుకుంటే, మరీను.

సుదాములు : (నవ్వుతూ) బ్రాహ్మణీ, ఒకనాడే, గోపాలకృష్ణుడే, ఏమి చేశాడనుకున్నావు?—వాళ్ల అన్న తొందరపాటు మనిషి! ఎందుకో కోపంవచ్చి నన్ను కొట్టవచ్చాడు. గోపాలకృష్ణుడు చప్పున అడ్డమువచ్చి ఆ దెబ్బ తాను తిన్నాడు. దానితో వాడి వీపు అంతా వాచిపోయింది—బుస్సున కుడుముపలెనే పొంగింది—అది చూచి, వాళ్ల అన్న పాపము కన్నీళ్లు కారుస్తూ కృష్ణుణ్ణి ఓదార్చబోగాడు—ఎంత చెడు పని చేశాను నాయనా, ఎంత దెబ్బ కొట్టానురా కృష్ణా, అంటూ— అప్పుడు కృష్ణుడేమన్నాడో తెలుసా?—అన్నా, నేను కాబట్టి సరిపోయింది. ఆ మహానుభావుడికి ఆ దెబ్బ తగిలి ఉంటే మనకు బ్రహ్మహత్య దాపురించేది కాదూ? మన గురువులు సాందీపనుల వారికి ఎంత కష్టమయ్యేది? మన యాదవ వంశమే నాశనమయ్యేది కదా !—అప్పటికి గాని బలరాముడు తన తొందరపాటు తెలుసుకోలేదు. అతను నా రెండు కాళ్లూ గట్టిగా పట్టుకొని వదలలేదు. నాకూ కన్నీళ్లువచ్చి అతన్ని కౌగిలించుకున్నాను— కృష్ణా, ఏమిటి ఇట్లా వీపు వాచిందేమిటి అంటూ, నా కన్నీళ్లతో ఆ వాపు తుడిచాను— బ్రాహ్మణీ, అప్పుడేమి అద్భుతం జరిగిందో తెలుసా?—వెంటనే ఆ వాపంతా పూర్తిగా మాయమయింది. కృష్ణుడు నవ్వాడు—దొంగ !

బ్రాహ్మణి : చూచావుగా—అదీ నాయనా, వారి తీరు !

శ్రేష్ఠి : ఏకృష్ణుని సంగతమ్మా, వారు స్మరణచేసేది?—నిజమా, కలా, తల్లీ ?

బ్రాహ్మణి : నిజమే కాని కలవంటిది—వెనక ఎప్పుడో సాందీపనుల వారి గురుకులంలో వారి సహాధ్యాయుల సంగతి.

శ్రేష్ఠి : ఆ యాదవకృష్ణుల సంగతేనా తల్లీ!

బ్రాహ్మణి : అవును శ్రేష్ఠీ !

శ్రేష్ఠి : అయితే నేను విన్నది నిజమే అన్నమాట ! మరయితే మీకీదారిద్ర్యము ఎందుకమ్మా, తల్లీ ?

బ్రాహ్మణి : నీవెంత అమాయకుడవు శ్రేష్ఠీ!—ఆ మహారాజుకు జ్ఞాపక ముంటుందా?

శ్రేష్ఠి : జ్ఞాపకం లేకపోతే జ్ఞాపకం చేసేది. అటువంటి వారి కింద వేలా లక్షలు జీవనంచేస్తూ ఉంటే మీవంటి

పుణ్యాత్ముల కుటుంబానికి ఈ మాత్రం సహాయం చేయలేరా ?

బ్రాహ్మణి : శిష్యా, అట్లా కాదు. రాజులకు ఐశ్వర్యమదము సర్వసాధారణము—జ్ఞాపకం లేదా ద్రోణాచార్యుల వారిదీ ద్రుపదరాజులదీ కథ? లోకమంతా మోగిపోయింది కదా, అప్పుడు! సహపాఠియైన ద్రోణాచార్యులవారు పాపము తన కుమారునికి పాలులేక ద్రుపదరాజును చూడబోతే, ఆయన పరాభవించలేదా! పైగా తాను రాజైన తర్వాత తన రాజ్యానికి వస్తే గొప్ప పదవి ఇస్తానని ప్రతిజ్ఞచేసి ఉన్నవాడు కూడాను.

శిష్యు: అవును గాని తర్వాత ద్రుపదరాజులకు ఆచార్యులుచేసిన పరాభవంతోనైనా రాజులకు మతి తిరిగి ఉండదా?

బ్రాహ్మణి : ద్రోణులు ధనుర్వేదము నేర్పిన ఆచార్యులు. వీరో బ్రహ్మవిద్య నేర్పినవారు. వీరికి కోపమేరాదు, శిష్యా!— వస్తేనా, పాప మా కృష్ణుడూ యాదవులూ అంతా నశిస్తారు నాయనా! అంత పాతిత్యము కట్టుకోడం మా కెందుకు!—ఏదో విధంగా నాలుగురోజులు కళ్ళు మూసుకుంటే, కాలము వెళ్ళిపోదా! ఎప్పటికైనా మంచి రోజులు రావా?—రావే అనుకో! మన మెవరమూ శాశ్వతంగా జీవించము గదా!

సుదాములు : బ్రాహ్మణీ, ఇవ్వాళ ఎందుకో మా కృష్ణయ్య తండ్రి మనస్సంతా నిండివాడే. వాడు ఎంత చక్కటివాడనుకొన్నావు! ఆ నలుపులో చిత్ర మేమో కాని సహస్ర సూర్యుల తేజస్సూ కాంతీ, కోటిచంద్రుల చల్లదనమూ వెన్నెలా ఉన్నవే—ఎన్నాళ్ళయిందే వాణ్ణి కళ్ళారా చూచి?—వాడు నా ఒళ్ళు తాకితే ఎంత చమ్మగా ఉండేదే — ముక్తికాంత తాకినట్లేనే. కృష్ణా, గోపాలకృష్ణా, ఎక్కడున్నావురా, తండ్రీ?

శిష్యు : స్వామీ, అయితే తమరు గోపాలకృష్ణులవారి దర్శనానికి వెళ్ళరాదూ?

సుదాములు : నేనా, గోపాలకృష్ణుని దర్శనానికి వెళ్ళడము!— అయ్యో, ఆ సముద్రమధ్యంలో ఉన్న ద్వారకాపట్టణంలోకి నన్ను కావలివాళ్ళు పోనిస్తారా ?—ఆ మహాపట్టణంలో అతని యింటి జాడ నా కెవరు చెబుతారు? కాశీనగరంలోనే అడుగుపెట్టి ఎరగము మేము గురువులవారివద్ద బ్రహ్మచర్యవ్రతం నడిపేటప్పుడు. నగరంలో మనము అడుగు పెడతామా ? పెట్టినా ఆ మహాజనసమ్మర్దంలో మనకు దారి తెలుస్తుందా ?—నాయనా, కృష్ణా, నాకొకసారి కన బడరాదటోయీ— ఎందుకు కనబడుతావు!—నేను జ్ఞాపకముంటానా? ఎనిమిదిమంది మహిషులూ, పదహారువేలపైన వందమంది ఇతరభార్యలూ, వాళ్ళపిల్లలూ, పిల్లల పిల్లలూ ఉన్న నీకు జ్ఞాపకముంటానా ?

బ్రాహ్మణి : చూచారా శిష్యా, అదీ వారి తీరు!

శిష్యు : అమ్మా, గోపాలకృష్ణులవారు ద్రుపదమహారాజులవంటివారు కాదటమ్మా, ఆర్తులను రక్షించే భగవంతుడంటారమ్మా!

సుదాములు : ఓరి కోతికృష్ణా! నా ఉత్తరీయము నడుముకు చుట్టుకొని చెట్లెక్కి ఆకులు కోస్తూ ఉంటే, నడుముకు బిగించిన ఉత్తరీయపుకొంగు కొంచెము జారింది. వాడు దాన్ని పట్టుకొని వేళ్ళాడాడు. ఏముంది! దానితో ఆకాశానికి అంటి ఉన్న చెట్టు చిటారుకొమ్మమీదనుండి ఇద్దరమూ జారి కిందపడ్డాము! నే నతన్ని గట్టిగా కావిట వేసుకొన్నాను. ఎట్లా గనుకొన్నావు, 'పావురాళ్ళు ఆకాశంలో పల్లిమొగ్గలు వేస్తవే, అట్లా పల్టీలు కొడుతూ పడ్డాము. తలకాయలు పగిలిపోవలసింది—ఇద్దరమూ సరిగ్గా కాళ్ళమీద తిన్నగా నిలబడ్డాము. వాడేదో గారడీ చేశాడు. నాకు భయముకూడా వేయలేదు వాడి కౌగిటిలో.

శిష్యు: శ్రీకృష్ణులవారు ఆకతాయిగా ఉండేవారా ?

సుదాములు : ఆకతాయా, ఆకతాయా?—ఐతే ఏమి, నా కింత బాధ కలగనిచ్చేవాడు కాదు. కాని కొంతమంది రాజపుత్రులను నానాహింసలూ పెట్టేవాడు. మరీనూ ఆ పౌండ్రకుణ్ణి, శిశుపాలుణ్ణి, దంతవక్త్రుణ్ణి!—

శిష్యు: గురువుల దగ్గరకూడా అల్లరి చేసేవారా ?

సుదాములు : అమ్మో, గురువులవద్దనే ? అల్లరే? సాందీపనులవారివద్ద భగవంతుడు కూడా అల్లరి చేయలేదు. పిల్లిలాగె ఉండేవాడు. వారో, మమ్ములను తమ పిల్లలుగానే చూచేవారు!—మరీ వారికి పుత్రవియోగము కలిగిన తర్వాత, వారికి విద్యార్థులే పుత్రులూ, విద్యలే పుత్రికలూను.

బ్రాహ్మణి : మన విద్యార్థులుకూడా తిండిలేక చాలా బాధపడుతున్నారు.

సుదాములు : నిజంగానా, బ్రాహ్మణీ ?

బ్రాహ్మణి : నిజంగానే చూడండి—వస్తున్నారదుగో!

[విద్యార్థులు ప్రవేశము]

ఏం నాయనలారా, ఇట్లా వచ్చారు?

బ్రహ్మచారులు : ఇవ్వాళ ఊళ్ళోకి భిక్షకు వెళ్ళినా భిక్ష పెక్కడా పుట్టలేదు. ఏ ఇంట్లోనూ పొయి రాజలేదు.

సుదాములు : మీకెంత ఆకలివేస్తున్నదోగదా !— భిక్ష కెందుకు వెళ్ళినారు? బ్రాహ్మణీ, వీళ్ళందరికీ వెంటనే వంట చేసిపెట్టు !

బ్రాహ్మణి : అయ్యో! (ఇంట్లోకి నిష్క్రమించును.)

బ్రహ్మచారులు: స్వామీ, మాకేమీ ఆకలి లేదు. మన యింట్లో బియ్యము నిండుకొని ఉన్నవి - భిక్షాన్నము తెచ్చి సమర్పిద్దా మంటే, ఊళ్ళో బ్రాహ్మణ్యమంతా ఇట్లాగే ఉన్నట్లున్నది— ఎవరింటనూ పొయి రాజలేదు— బ్రాహ్మణుల ఇళ్ళన్నీ ఒకే తీరుగా ఉన్నవి—

తుడి. ఒకసారి చూడవలె ననుకున్నాడంటావా, మా కృష్ణయ్య తండ్రి? అయితే వెంటనే బయలుదేరుతాను!—కృష్ణా, కృష్ణా, ఇదుగోరా వస్తున్నాను! — బ్రాహ్మణీ, నా గోపాలకృష్ణుడు మహారాజు తెలిసిందా?—రాజాధిరాజు!—వాడికి కానుకగా ఏమి తీసుకువెళ్ళది?

బ్రాహ్మణి : (కళ్ళనీళ్ళతో స్వామీ, ఇదిగో ఈ అటుకులు! ఇవి నాలుగిళ్ళలో అడిగితెచ్చి మీకు నా పెట్టె ఇద్దామను కొంటున్నాను—ఇంతకంటే ఏమి లేవు.

సుదాముడు: లే, ఏదుంటే అదే! నేను తులసీదళ మిచ్చినా త్రిలోక రాజ్యంకంటే ప్రియంగా తీసుకొంటాడు. లే!—మూట కట్టుకొంటాను!

[అటుకులు చినిగిన కొంగున మూటకట్టుకుంటూ]

యశ్శివో నామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళా
తయోః సంస్మరణాత్పుంసాం విఘ్నస్తత్ర నజాయతే.

—ద్వారకానగరానికి వెళ్ళివచ్చేదాని బ్రాహ్మణీ, బ్రహ్మచారులకు ఏమీ భోజనం లోపము చేయబోకు సుమా! బ్రాహ్మణీ, నాచేత శ్రీకృష్ణదర్శనం చేయిస్తున్న శుభ సర్వమంగళా కలుగుగాక!

[అంతా నిష్క్రమణం]

## రంగము రెండు

[ద్వారకానగరంలో దేవకీదేవి మందిరము. ప్రవేశము దేవకీదేవి—శ్రీకృష్ణుడు]

దేవకి : ఏం నాయనా?

శ్రీకృష్ణుడు : అమ్మా, ఏమో కడుపులో మంటగా ఉన్నదమ్మా!

దేవకి : ఆకలేమో రా!

శ్రీకృష్ణుడు : లేదమ్మా!

దేవకి : నా కోడళ్ళు ఎనిమిదిమంది ఉన్నా, ఒక్కరూ కడుపు నిండా అన్నమే పెట్టలేదా?

శ్రీకృష్ణుడు : లేదమ్మా!

దేవకి : అయితే వాళ్ళా చేతులూ కడుక్కో, ఇక్కడ తిందువుగాని.

శ్రీకృష్ణుడు : ఏమి వండావమ్మా?

దేవకి : అయితే కనుక్కుంటా ఉండు!—ఏమే, ఇవ్వాళ ఏమి వంట చేశారే?

[తెరలో]

చేటి : గోఘృతంతో నివ్వరి ధాన్యం వండి—

[ఇంతలో కలకలంగా అష్టమహిషులూ ప్రవేశము]

రుక్మిణి : అత్తా, శ్రీకృష్ణదేవులకు కడుపునిండా భోజనం పెట్టారా? మా యింట్లో ఏమి ముట్టలేదు.

సత్య : అత్తా, నా చేతితో ఏది వడ్డించినా ఆప్యాయంగా ఆరగించేవారు, ఒక్క మెతుకు ముట్టుకో లేదివ్వాళ.

లక్షణ : అత్తా, ఎప్పుడూ ఇట్లా నా చేతిపెట్టు నిరాకరించి ఎరుగరే.

భద్ర : నా కర్మము, నాచేతిపెట్టె పనికిరాకపోయిందా అని నాకు కోపముకూడా వచ్చిందత్తా, ఎంత మతిలేనిదాన్ని!

సుదంత : ఇదేమైనా జబ్బు కాదు గదా అత్తయ్యా.

జాంబవతి : ఏ రాక్షసునితోనైనా యుద్ధముచేసి వచ్చారేమో, అత్తయ్యగారూ!

మిత్రవింద : నాకు తలుచుకుంటే ఇదంతా ఏదో అయోమయంగా ఉన్నది, అత్తయ్యా!

కాళింది : నా హృదయంలో ద్రవీభూతమై ప్రవహించే మరలు త్రావే అమృతము కలిపిపెట్టినా వద్దన్నారు. ఏమిచేయ గలను, అత్తా!

దేవకి : నాయనా, ఏమిరా కృష్ణా, ఇది ఏమైనా అమాయకు రాళ్ళు నా కోడళ్ళందరినీ అల్లరిపెట్టే పద్ధతి కాదు గదా, తండ్రీ!

శ్రీకృష్ణుడు : అయ్యో, కాదమ్మా, నీ చేతి పెట్టినన్నా తింటే కడుపు మంట తీరుతుందేమోనని యిట్లు వచ్చానమ్మా!

[ముఖము బాధతో చిట్లిస్తాడు.]

దేవకి : అయ్యో, నాయనా — త్వరగా లే తండ్రీ భోజనానికి!

శ్రీకృష్ణుడు : ముందు, ఏమి చేశారో చెప్పు, మీ ఇంట్లో?

దేవకి : చేటి, ఏమి చేయించావో చెప్పు.

చేటి : గోఘృతంతో నివ్వరిధాన్యం వండి దానిలో ఘుమఘుమలాడే సుగంధ ద్రవ్యాలతో పాటు శొంఠి, సైంధవ లవణం చల్లి అజీర్ణ హరంగా చేసి వున్నది.

రుక్మిణి : సరిగ్గా మా యింట్లోనూ అదే చేయించా నత్తా.

[అది విని తక్కిన మహిషులు ఇంతేనా అన్నట్లు కనబడీ కనబడకుండా మూతులు విరుస్తారు—ముందు తక్కిన మహిషులు చెప్పేప్పుడు కూడా రుక్మిణి తప్ప మిగిలిన వాళ్ళు అట్లాగే చేస్తారు.]

శ్రీకృష్ణుడు : దాని మాట వింటేనే కొరపోతున్నది.

[దగ్గుతాడు. శ్వాస కష్టంగా ఆడుతున్నది.]

[తక్కిన మహిషులు సంతోషిస్తారు. ముందుకూడా రుక్మిణి తప్ప తక్కినవారు అంతే]

దేవకి : ఏమినాయనా, అట్లా దగ్గుతున్నావు! పోనీ, అట్లా అయితే అది వద్దులే. ఇంకా ఏమి చేయించినావే చేటీ?

చేటి : వరాహమాంసము నెసగవప్పుతో కలిపి వండి మిరియాలు కుంకుమపువ్వు కస్తూరి ఇంగువ ధనియాలు దాచినచెక్క ఇత్యాదులతో కమ్మగా పోపువేశానమ్మా!

జాంబవతి : మా నాయన ఈ ఉపాయమే పోరువరాహాన్నివేసి వెంటనే భగవాను మీద భక్తిచేత పంపించాడు అత్తా!

ఆప్యాయంగా ఆరగిస్తారని ఎన్నెన్నిరకాలుగానో చేయిం చాను. భక్తుని ఉడుగర అని ఎక్కువ ఇష్టపడతారని అనిచాను.

శ్రీకృష్ణుడు : అబ్బబ్బా, ఆ భల్లూకపు పట్టూ దెబ్బలూ వెనక వాతో యుద్ధముచేసిన రోజు మళ్లా జ్ఞాపకము వచ్చి గొంతుపట్టినట్లవుతున్నది, తలుచుకుంటేనే !

(శరీరమంతా కుంచిస్తాడు.)

చేటి : పోనీ, అది నాకపతే మానె. కృష్ణ మృగమాంసము సన్న సన్నని ముక్కలుచేసి పెసరపప్పుతో వేయించిన పొత్తాలింపు కూరకూడా ఉంది.

సత్య : సరిగ్గా ఇదే మాయింట్లోనూ చేయించా.

శ్రీకృష్ణుడు: కృష్ణ మృగమాంసమా నాకు నయించేది, అబ్బబ్బా!

[సత్య చిన్నబుచ్చుకుంటుంది. తక్కిన మహిషులు ఆమెవైపు విడ్డూరంగా చూస్తారు.]

చేటి : గోదధి పడగట్టి శర్కర కలిపి కస్తూరి కుంకుమపువ్వు పచ్చకర్పూరం ఏలకులు లవంగాలు ఇత్యాది సుగంధ ద్రవ్యాల చూర్ణాలు కలిపి శ్రీఖండం చేశాము.

భద్ర : నేనూ ఇదే చేయించాను.

శ్రీకృష్ణుడు : శ్రీఖండం తలుచుకుంటేనే డోకు వస్తున్నది.

చేటి : ఇవ్వాళనే దాశరాజులు సముద్రపు అగాధజలాలలో పట్టిన అపూర్వమత్స్యాలు తెచ్చి సమర్పించారు. వాటితో రకరకాల కూరలూ పచ్చళ్ళూ చేశాము.

మిత్రవింద : మా మహానసంలోకూడా అవే చేయించాను.

శ్రీకృష్ణుడు : ఛీ, ఛీ! మత్స్యాహారమంటేనే ఓకిలింత వస్తున్నది, పాడు వాసన.

చేటి : ఆవుపాలూ, చెరుకురసమూ, తేనె కలిపి ఘాటైన మిరియాలతో తీయని పానీయముచేసి ఉన్నది.

కాళింది : నేనూ అట్లాగే చేయించాను.

శ్రీకృష్ణుడు : ఆ పానకం తీపి మొహంమొత్తుతున్నది.

చేటి : కీచకులు సింధుభూముల అరణ్యాలలోనుంచి రంగురంగుల కపోతాలు పట్టి తెస్తే వాటితో ముద్రాహారము బహు మృదుల మధుర మనోజ్ఞంగా చేసినాము.

సుదంత : మా యింటనూ ఇదే చేయించి స్వామిని ఆరగించమన్నాను.

శ్రీకృష్ణుడు : అది తలచుకుంటేనే అసహ్యంగా ఉన్నది.

చేటి : అమ్మా, మన యింట్లో గోక్షీరముతో ద్రాక్ష పండ్లు, పెసరపప్పు కలిపి చక్కెర పొంగలి చేసి హయ్యంగవీనము కుమ్మరించినాము. దానితో వంట యిల్లంతా ఘుమ ఘుమ లాడుతున్నది.

దేవకి : నాయనా, నీకు చక్కెర పొంగలి అంటే యిష్టమే గదా ! తిందువుగాని పద !

లక్ష్మణ : అత్తా, నేనూ అదే చేయించి ఆరగించమన్నాను గదా !

శ్రీకృష్ణుడు : దాని పేరు చెబితేనే ఇవ్వాళ వెళ్లిపొయ్యేటట్లు ఉన్నది.

దేవకి : చేటీ, నా కోడళ్లు చేయించినవే కాని మన మహానసంలో మరేమీ చేయించలేదు టే ?

చేటి : చేయించకేమి తల్లీ ! గోదధితో దధ్యోదనము అల్లము మిరియాలతో కమ్మగా చేయించాను. నిమ్మకాయల పులుసుతో అప్పుడు గానుగాడిన స్వచ్ఛ తైలంలో తిరుగమాత పెట్టిన పులిహోర, చూపులకే ఎంతో ఆకర్షకంగా ఉన్నది. గారెలు, లడ్లు, జిలేబి, హల్వా, బాసంది, గులాబుజాము.

శ్రీకృష్ణుడు : చాలు, చాలు, వాటిపేర్లే వినలేకుండా ఉన్నాను.

దేవకి : మరేమి కావలె నాయనా ?

శ్రీకృష్ణుడు : ఏవీ అక్కరలేదమ్మా, ఆకలివేస్తున్నది వీళ్ల కేమి తెలుసునమ్మా నా రుచులు, కన్నతల్లివి నీకు కాకపోతే !

దేవకి : (కంట తడిపెడుతూ) నాయనా, నిన్ను కనడమే కాని పెంచనైనా పెంచలేదుగదరా నేను. ఒక్కచుక్కపాలైనా ఇచ్చి ఎరగనుగదా తండ్రీ ! పాప మా యశోద వస్తే, దానికి తెలియవచ్చు! దూరాన ఉన్నది గదా. కబురంపినా రావాలంటే వారమురోజులైనా పడుతుంది.

చేటి : చిత్రము తల్లీ ! అదుగోనమ్మా, యశోదమ్మగారు రానే వస్తున్నారు, చూడండి.

దేవకి : నిజంగా ? దానికి తెలుసు, మా కృష్ణయ్య తండ్రికి ఏవేళ ఏది కావలెనో!

[యశోద, కొందరు గోపికలు పాలు పెరుగుల దుత్తలతో ప్రవేశము]

యశోద : (ప్రవేశిస్తూనే) నా కృష్ణయ్య తండ్రీ !

[అంటూ పసివాణ్ణివలె కౌగిలించుకుంటుంది; ముద్దాడుతుంది.]

ఇదేమిటి నాయనా ! నీ నిండుబొజ్జ, నీ పొన్నారిబొజ్జ, ఖాళీ ... రుమంటూ అక్కళించుకొనిపోయి ఏడుస్తున్నది ! అయ్యో, పేగు లట్లా అరుస్తున్నవి.

శ్రీకృష్ణుడు : ఆకలి వేస్తున్నదమ్మా, ఆకలి !

యశోద : దొంగా, నీకు ఆకలా ? ఇంతమందీ ఉండి వీళ్ళు నీ ఆకలే తీర్చలేకపోయినారూ ? ఒక్కరు వేషాలు.

దేవకి : మాకు తోచినవన్నీ చెప్పామమ్మా ! ఏది చెప్పినా డోకు అంటాడు, మరేమి కర్మమో ఇది.

యశోద : ఆవు పాలు ఇచ్చారా ?

దేవకి : ఒక్క పాలేమిటి, ఎన్నో కలిపిసి ఇచ్చినా, చద్వంటాడు.

యశోద : గోపీ, ఆ పాలిట్లా తేవే. వ్రజంలోనుంచి తెచ్చిన తాజా పాలు !

[అందుకొని ఆవు పాలిస్తుంది. శ్రీకృష్ణుడు ఆ పాలు త్రాగుతాడు. పొట్ట నిండుతుంది. అంతా సంతోషిస్తారు. ఇంతలో ఒక్కసారి తాగిన పాలన్నీ వెళ్ళబోసుకుంటాడు.]

యశోద : అయ్యో నాయనా — ఆ పాలు విరిగినవిరా. విరిగిన పాలు తెచ్చారుటే ! — అయితే ఈ పెరుగు తాగు !

[అని గోపిక దగ్గర పెరుగు తీసుకొని ఇస్తుంది.]

శ్రీకృష్ణుడు : (చప్పరిస్తూ) ఎంత అప్యాయంగా ఉందమ్మా ఈ పెరుగు !

[మహిషులంతా చిన్నవుచ్చుకుంటారు. అకస్మాత్తుగా అదికూడా వికారపెట్టుతున్నట్లు ఐ వెళ్ళబోసుకుంటాడు.]

యశోద : అయ్యో, ఖర్మమా! పులిసిన పెరుగు తెచ్చారు నాబో టివే. అయితే పోనీ ఈ వెన్న తిను! నీకు ఇష్టమేగా! మాయింటి వెన్నరా!

[శ్రీకృష్ణుడు నోట్లో పెట్టుకొని ఉమిస్తాడు అసహ్యపడుతూ.]

యశోద : దొంగ కుంకయ్య కృష్ణయ్యా ! దొంగ వెన్న కాని రుచించదు కాబోలు వెన్నదొంగలుగారికి ! ఎక్కడ దొంగి లించేను?

శ్రీకృష్ణుడు : ఆకలమ్మా !

రుక్మిణి : స్వామివారు యశోదమ్మగారిదగ్గర ఐదేళ్ల పిల్లవాడుగా కనిపిస్తున్నారేమి?

[అంతా ఆశ్చర్యపోతున్నారు]

యశోద : అయ్యో నా తెలివిమండా !— నా పాలు తాగవలెనని వీడికి మనసయింది కాబోలునే. నా రొమ్ముల అందుకే పాలు నిండినవి.

సత్యభామ : అక్కా, స్వామివారు సంవత్సరం పసిపాపడుగా కని పిస్తున్నారేమి !

[అంతా ఆశ్చర్యపడుతుండగా యశోద శ్రీకృష్ణుణ్ణి ఒళ్ళోకి తీసుకొని పాలు కుడుపుతుంది.]

దేవకి : యశోద ఎంత ధన్యురాలు !

భద్ర : అయ్యో, మన కృష్ణస్వామిని యశోదమ్మగారు హరిం చింది.

సుదంత : అయ్యో, స్వామి ఏడమ్మా ?

తక్కిన మహిషులు : యశోదమ్మ తల్లీ, నీవు వచ్చి మమ్ములను రక్షించావమ్మా ! శ్రీకృష్ణులవారి ఆకలి తీర్చావమ్మా! బ్రదికినామమ్మా !

[యశోద రెండు రొమ్ములలో పాలూ ఐపోతవి. పైటతో మూతి తుడిచి వెన్ను రాస్తుంది. శ్రీకృష్ణుడు తృప్తిపడ్డట్లు ఒక్క క్షణము కన్నుమూస్తాడు. యశోద ఒడిలోనుంచి లేవగానే యధాప్రకారము పెద్దవాడవుతాడు.]

శ్రీకృష్ణుడు : అమ్మా, ఆకలే!

యశోద : నాయనా, నా రొమ్ముల్లో ఒక్కచుక్క పాలు మిగల కుండా తాగావు గదా, ఇంకా నేనిచ్చేది తండ్రీ ?

[కంటనీరు పెడుతుంది]

శ్రీకృష్ణుడు : ఆకలే ! — ఆకలే !

[తెర పడుతుంది.]

## మూడవ రంగము

[ద్వారకానగర ద్వారప్రదేశము]

సుదాములు : నాయనా, ఇదేనా ద్వారకానగరం?

1. ద్వారపాలకుడు : చిత్తము, స్వామీ!

సుదాములు : నాయనలారా, మీరెందుకు, చేతుల్లో గదలు పట్టు కున్నారెందుకు ?

2. ద్వారపాలకుడు : మేము ద్వారపాలకులము, శత్రువులు లోపల ప్రవేశించకుండ కాపలా కాస్తున్నాము.

సుదాములు : నేను శ్రీకృష్ణుణ్ణి చూడడానికి వచ్చానుగాని మరి నన్ను లోపలికి పోనిస్తారా ?

1, 2. ద్వారపాలురు : చిత్తము ! (నమస్కరిస్తారు)

సుదాములు : ప్రభువుల ద్వారపాలకులకు ఏమైనా బహుమాన మిస్తేగాని లోపలి కెవరినీ పోనీయరంటారు. మీకు నా ఆశీర్వచన మిస్తాను. మీకు సర్వశుభాలు కలుగుగాక.

[ఇద్దరు ద్వారపాలకులూ ఆయన కాళ్ళకు మ్రొక్కుతారు]

1. ద్వా. పా.: పెద్దల ఆశీర్వచనంకంటె మాకేం కావాలె! ఇతర బహుమానాలు తీసుకునే ద్వారపాలకులు ద్వారకా నగ రాన లేరు.

2. ద్వా. పా : మీబోటివాళ్ళను అడ్డగిస్తే మా ప్రాణాలు నిల వవు. శ్రీకృష్ణప్రభువులు సత్ప్రోక్తులు !

సుదాములు : ఎంత మంచివాళ్ళు నాయనా మీరు? నాకూ తెలుసు అతడు సత్పాత్రుడని అనుభవం వల్ల. చిన్నప్పుడు మా గురువుల గురుకులంలో ఏమయిందో తెలుసునా ?

1 ద్వా. పా : చిత్తము, సెలవీయండి.

**సుదాముడు :** సమిధలు తీసుకురావడానికి అడవిలో ఆ రోజు ఒంటరిగా దూరము వెళ్ళాను, గంగాతీరాన. అక్కడ ఇసుకమీద పెద్ద మొసలి పాకుతూ నన్ను చూచి నోరు తెరిచింది. నేను చూడనేలేదు. ఎక్కడినుంచివచ్చాడో మా కృష్ణయ్య తండ్రి, దాని నోరు రెండు దవడలూ రెండు చేతులతో పట్టి చీల్చి అవతల పారేశాడు—అప్పుడు చూచాను నేను. అనాటినుండి నా వెంట రానుకూడాలేదు. ఎప్పుడూ నన్ను వెయ్యికళ్ళతో కనిపెట్టి ఉండేవాడు.

1 ద్వా. పా : చిత్తము, తమరు వారి సహాధ్యాయులన్నమాట. తమరు చాలా అలిసి ఉన్నారు బాబూ !

**సుదాముడు:** శ్రీకృష్ణుని ఇల్లు ఎక్కడ ఉంటుంది నాయనలారా?

1 ద్వా. పా . వారి భవనమా? నగరిమధ్యలో వారి భవనము తెలియనివాళ్ళెవరు? అయినా తమరు అలిసి ఉన్నారు, నడ లేరు కాని మా చేతులమీద ఎక్కించుకునిపోతాము.

[ఇద్దరూ చేతులు చాపి కుర్చీగా చేసి ఆ చేతుల కుర్చీ మీద సుదాముని కూచోబెట్టుకొని శ్రీకృష్ణ భవనానికి బయలుదేరుతారు.]

[శ్రీకృష్ణభవన సమీపంలో శ్రీకృష్ణుడు పరుగెత్తుకుంటూ ఎదురౌతాడు. రుక్మిణీ సత్యభామాదులు వెనకాల ఎదుర్దాగా వస్తూంటారు పీఠివెంట.]

**సత్యభామ :** స్వామికి ఇవ్వాళ ఏమొచ్చి ఎత్తరేదు ఈ!

**శ్రీకృష్ణుడు :** ఎన్నాళ్ళకు కనిపించావు స్వామీ! నీ కోసము కలవరిస్తున్నాను.

**రుక్మిణి :** ఈయన ఎవరే నారదుడు కాడు, దుర్వాసుడూ కాడు— ఎవరే ఇంత మహాపురుషుడు !

[శ్రీకృష్ణుడు సుదాముల రెండు పాదాలూ భక్తితో రెండు చేతులతో మృదువుగా గ్రహించి శిరస్సున పెట్టుకుంటాడు.]

**రుక్మిణి :** (సుదాముల రెండుపాదాలూ నెత్తిన ధరిస్తూ)

అది భిక్షువు పదాశిష్టమ్మా వీరు !

[అది చూచి తక్కిన మహిషులు ఒక్కొరొక్కరే సుదాముల పాదాలు శిరస్సున ధరిస్తారు ]

**సుదాముడు :** (ఆనందబాష్పాలతో) మీకు తగినవాళ్ళరా నీభార్యలంతాను ! ఏమో ఏమో అనుకున్నాను.

**రుక్మిణి :** మేమంతా ధన్యురాళ్ళము.

**శ్రీకృష్ణుడు :** దింపండి నేలమీదికి. (ద్వారపాలకులు దింపుతారు)

[అంతట రుక్మిణీ సత్యభామలు ఒక పాదమూ, మరి యిద్దరు ఇంకొక పాదమూ, ఇద్దరిద్దరు చెరి ఒక బుజమూ పట్టుకొని సుదాములను ఎత్తగా శ్రీకృష్ణుడు నడుమూ మెడా పూని దేవతామూర్తినివలె మందిరంలోకి తీసుకొనిపోయి శ్రీకృష్ణుని తల్పంమీద కూచోబెడతారు. రుక్మిణి బంగారు కలశంతో జలము తెస్తుంది. సత్యభామ బంగారు పళ్ళెము పాదాలక్రింద ఉంచుతుంది. రుక్మిణిపోసే గంగతో శ్రీకృష్ణుడు పాదప్రక్షాళన చేస్తాడు. తక్కిన పత్నులు తాము కట్టిన పట్టుపుట్టాల చెరగులతో తడి ఒత్తుతారు. శ్రీకృష్ణునితోపాటు అంతా పాదోదకం శిరస్సులపై చల్లుకొంటారు ]

**శ్రీకృష్ణుడు :** ఈ మహానుభావుడు దూరప్రయాణాలతో చాలా బడలి ఆకలితో ఉన్నాడు. వెంటనే అభ్యంజనస్నానము చేయించి భోజనము ఏర్పాటుచేయండి.

**సుదాముడు :** నీవు తాకేనే అమృతస్నానమయిందిరా, ఎంత చల్లగా ఉన్నదిరా, నీ తను స్పర్శ ! నీ దివ్యమంగళవిగ్రహం చూస్తుంటేనే కడుపు నిండుతున్నదిరా కృష్ణయ్య తండ్రీ!

[మహిషులంతా అడావిడిగా అభ్యంజనాదులకు పరుగెత్తుతారు.]

[తెర]

## నాల్గవ రంగము

[ప్రవేశము ద్వారకానగరపౌరులు—వీథిలో]

1 పౌరుడు : ఇంత విచిత్రం ఎన్నడూ చూడలేదే! కృష్ణస్వామిని ఉన్నతిలోరే

2 పౌరుడు : ఆ రుక్మిణి అమ్మవారు ఆ చినిగినబట్టల బావయ్యను దాసినకత్తెవలె ఉపచారము చేస్తున్నది.

3 పౌరుడు : ఆ సత్యభామమ్మగారు కట్టిన చీరె ఇంత మాయనీయదే, అట్టువంటి ఆమెగారుకూడా ఆ బావనయ్యపాదాల కంటిన ఎర్రటిమట్టి చీరెచెంగుతో తుడిచి ఆ ఎర్రటి మృత్తిక ముఖాన తిలకంగా ధరించింది.

4 పౌరుడు : ఒకరేమిటి, అష్టమహిషులూ ఆయనకు వంతులుపడి ఉపచారాలు చేస్తున్నారు. ఎవరైయుంటాడు చెప్మా, ఈయన ?

1 పౌరుడు : నారదుడా ?

2 పౌరుడు : మహర్షి ఏదీ? దూర్వాసుడేమో!

1 పౌరుడు : అయితే జడలేవీ ? ఈ చిరుగుగుడ్డలు కడతాడా ఆయన, పట్టులాయిగాని !

3 పౌరుడు : ధర్మరాజులవారైయుంటారు.

4 పౌరుడు : ఓరి బుద్ధిహీనుడా ! అరణ్యవాసంచేస్తూ ఉంటే మాత్రం ధర్మరాజులవారి కేమి కొదవ ! ఇంత దీనంగా ఉంటారా? అసలు వారు నియమభంగంచేసి నగర ప్రవేశం చేస్తారా ?

3 పౌరుడు : మరి ద్రోణాచార్యులో, కృపాచార్యులవారో ?

1 పౌరుడు: వాళ్లయితే ధనుర్బాణా లుండద్దూ?

2 పౌరుడు : ఎవరో ఋషీశ్వరులు రా!

3 పౌరుడు : కాదురా, ఆదిభిక్షువు, సాంబసదాశివుడు !

4 పౌరుడు : శివుడైతే ఈ పింపిరిగడ్డ లేమిటి? భుజగభూషణా లేవి? గజచర్మాంబర మేదీ? త్రిశూల మేదీ? నెత్తిమీద గంగ ఏది? శిఖలో నెలవంక ఏది? ఇంత చిక్కి శల్యమై ఉంటాడా ఆయన ?

3 పౌరుడు : ఐతే ఎవరో పేద బ్రాహ్మడు.

1 పౌరుడు : చిరుగుగుడ్డల వాడు.

2 పౌరుడు : కుచేలుడు.

3 పౌరుడు : అవును కుచేలుడే !

4 పౌరుడు : ఈ కుచేలుని మనము చూడాలేదో ఇంతమందీ ఇట్లా ఉపచారాలుచేస్తూ ఉంటే, పెద్దనైన వారింటివాడే! అష్ట మహిషులు కూడా కొండపోతున్నారు.

1 పౌరుడు : అయితే మనము ఈ ఉపచారాలు ఎవరు చేస్తున్నారో గమనించనే లేదు. శ్రీకృష్ణ ప్రభువులవారి వంకే ఆప్యాయంగా చూస్తూ ఏదో ఏదో మాట్లాడుతూ ఉన్నాడు.

[నిష్క్రమణము]

## ఐదవ రంగము

[ప్రదేశము — శ్రీకృష్ణ మందిరము]

రుక్మిణి : (కరుణ్యతో) స్వామీ, ఇప్పుడు మీ ఆకలి తీరిందా?

శ్రీకృష్ణుడు : లేదు. సగము పొట్ట నిండింది. ఇంకా తృప్తి కలగలేదు.

సుదాముడు : కృష్ణా, ఆకలిగా ఉందా నీకు? నాకు చెప్పలేదేమి? నీకోసమని బ్రాహ్మణి అటుకులు మూట కట్టిందిరా. అవిగో తీసుకొని తిను.

శ్రీకృష్ణుడు : నిజంగానే! చెప్పరేమిరా ఏదీ, ఆ మహాతల్లి చేతి ప్రసాదము !

[మూట సవరించి అటుకులు రెండు గుప్పెళ్లు బొక్కుతాడు.]

రుక్మిణి : (వారించి) స్వామీ, చాలు చాలు ! మీకు తృప్తి అయింది. మీ వటన ఇప్పటికి అర్థమయిందిలెండి కాస్త. మీ భక్తులు మీకంటె మీకు ప్రియులు. ఈ మహాను భావుడు ఎన్నాళ్లయిందో బియ్యమెరి అన్నము తిని ! ఆయనకు ఆకలివేస్తుంటే, మీకూ వేసింది. ఆయన ఆరగిస్తే మీకూ కడుపు నిండింది.

[శ్రీకృష్ణుడు ప్రేమతో రుక్మిణివంక చూస్తాడు. మళ్లీ అటుకులు గుప్పెట పట్టబోతుంటే రుక్మిణి శ్రీకృష్ణుని చేయి గట్టిగా పట్టుకొని అటుకులువిడిపిస్తుంది.]

[తెరలో]

"కలలోనం దను మున్నెఱుంగని మహాకష్టాత్ముడైనట్టి దుర్బలుం డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోం దలఁపన్ వంటన మెచ్చి యార్తహరుడై తన్నైననిచ్చున్ సువిశ్రుతభక్తిన్ భజియించువారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్"

రుక్మిణి : ఆ బ్రాహ్మణి ఎంత పుణ్యరాశో కాని ఆపదలో ఉండి సంపద లర్పించి ఈ అటుకులు స్వామివారికి ఉపాయనంగా పంపింది-మీరీ పుణ్యదంపతులకు ఈ లోకంలో సామ్రాజ్యమంతా ఇయ్యదలచినా తిన్నది చాలు !-ఇంకా తిన్నారా అంటే వారి ఋణం తీర్చుకోలేరు స్వామీ !

[శ్రీకృష్ణుడు రుక్మిణి ముఖం చూస్తూ గుప్పిట పట్టిన అటుకులు మూటలో వదలి తృప్తిపడ్డట్లు త్రేనుస్తాడు.]

సత్యభామ : శ్రీకృష్ణదేవులవారి సర్వల రహస్యాలు అక్కగారి వల్ల మనమెన్నో తెలుసుకోవాలె !

జాంబవతి : అక్కగారు మనలను రక్షించింది. ఇంకా ఆ పుణ్యసాధ్వి పంపిన ద్రవ్యము ఆరగిస్తే, ఈ పుణ్య దంపతులకు మనలను ఎనిమిదిమందినీ జోడెత్తులుగా పంపినా ఋణం తీరేది కాదు.

భద్ర : రుక్మిణి అక్కా ! వారిద్దరూ సహాధ్యాయులు. ఏకాంతంగా ఏమయినా మాట్లాడుకొంటారు. మన మిక వెళదామా ?

[అష్టమహిషులు నిష్క్రమిస్తారు.]

సుదాముడు : కృష్ణా, నిన్ను చూడకుండా ఇన్నాళ్లూ ఎట్లా ఉండగలిగానో, తలచుకొంటే ఇప్పుడు ఆశ్చర్యంగా ఉన్నది.

శ్రీకృష్ణుడు : దేవా, మిమ్ములను మరీ వాలుగేళ్లబట్టి చూడాలని ఏదే ధ్యానిస్తున్నాను.

సుదాముడు : చూడవలెనంటే రాలేకపోయినావా ? దారుకుడు రథం తోలుకు రాడా ? మా గృహం పావన మయ్యేది గదా !

శ్రీకృష్ణుడు : మీ సన్నిధికి రథమెక్కి వస్తావా ?

సుదాముడు : భగవంతుడివి, మమ్ములను ఎట్లా ఆడిస్తావురా కృష్ణా ! నీకే చెల్లుబాటయిందిరా ఈ లీలలు !

శ్రీకృష్ణుడు : మీ రాకవల్ల మా ద్వారకానగరమూ, మా మందిరమూ కృతార్థమయినవి. మీ సేవ చేసి నా మహిషులు ధన్యురాండ్రయినారు. నే నక్కడికి వస్తే మాకీభాగ్యం ఎట్లా ప్రాప్తించేది ?

[తెర]

## ఆరవ రంగము

[ప్రదేశము: గురుకులములో: ప్రవేశము బ్రాహ్మణి, శ్రేష్ఠి]

శ్రేష్ఠి: అమ్మా, మీ పొలాలలో వాలుగేళ్ళుగా పేరుకొన్న పాప మంతా వదలిపోయింది.

బ్రాహ్మణి: ఏమిటా పాపము నాయనా?

శ్రేష్ఠి: మీకు గింజ కొలవకుండా పండినదంతా హరిస్తున్న ఆ కాపులు!

బ్రాహ్మణి: వాళ్ళేమి చేస్తారు, పాపము, వర్షాలు లేక పంటలు పండకపోతే.

శ్రేష్ఠి: ఎంత అమాయకులమ్మా మీరు? ఆ పాపిష్ఠులు ఉన్నందువల్లనే వర్షాలు లేవు.

బ్రాహ్మణి: మరి యిప్పుడు వర్షాలు పడుతున్నవిగా!

శ్రేష్ఠి: అదే విశేషము తల్లీ! వాళ్ళంతా ఊరు వదలిపోయిన రోజే వర్షాలు పడడ మారంభించినవి.

బ్రాహ్మణి: అదేమిటి, వాళ్ళ పాపము గ్రామము విడిచి పోయినారా? — ఎందువల్ల?

శ్రేష్ఠి: పాపము కూడానా?

బ్రాహ్మణి: అయితే మా యింటికి పుష్కలంగా ధాన్యమూ ఇతరగ్రాసాలూ పంపినది ఎవరు? వాళ్ళు కాదూ?

శ్రేష్ఠి: కాదు కాదు, కానేకాదు. వాళ్ళ పండిన ధాన్యమంతా ఇళ్ళలో దాచుకున్నారు. ఉపాధ్యాయులవారిదగ్గరా, తమ దగ్గిరా, ధాన్యము ఏమీ లేనేలేదని చెప్పరాని ఒట్లు పెట్టుకున్నారు గదమ్మా!—వాళ్ళ ఇంటికిపోయి చూచుకుంటే, ఇళ్ళల్లో దాచుకొన్న ధాన్యము గింజలేకుండా ఎప్పుడూ కని విని ఎరగని కృష్ణవర్ణపు పురుగులుపడి తినివేసి ఉన్నవి.

బ్రాహ్మణి: అయ్యో, పాపము!

శ్రేష్ఠి: ఇంకా వినండమ్మా పిల్లలమీద ఒట్లు పెట్టుకొన్నారు గదా!—వాళ్ళపిల్లలకందరికీ మహావ్యాధులు వచ్చినవి.

బ్రాహ్మణి: అయ్యయ్యో, నాకు చెప్పకపోతివేమి! తెలిస్తే ఏదో తీర్థమో ఔషధమో పంపేదాన్ని కదా!

శ్రేష్ఠి: మీ తీర్థౌషధాలుకూడా పనిచేయలేవమ్మా, భగవంతుడికి ఆగ్రహము తెప్పించిన వారిమీద! ఉపాధ్యాయులవారు శ్రీకృష్ణస్వామివారి దర్శనానికి బయలుదేరినారని తెలిసింది వాళ్ళకు! అదేతడవ, వాళ్ళు గజగజలాడుతూ ఎవరిదారిన వాళ్ళు పారిపోయినారు పెళ్ళాం బిడ్డలనికూడా వాళ్ళ కర్మానికి వాళ్ళను వదిలేశారు. ఆ రోగిష్ఠి పిల్లలనువేసుకొని పెళ్ళాలు ఊళ్ళమీద అడుక్కుంటూ పెనిమిట్లను వెదుక్కుంటూ ఏడుస్తూపోతున్నారు.

బ్రాహ్మణి: (కంటతడితో) పాపము, వాళ్ళను భగవంతుడు అనుగ్రహించుగాక!

శ్రేష్ఠి: అమ్మా, మీ కృపాతిశయానికి అంతులేకపోవచ్చునుగాని భగవంతుడు దుష్టశిక్షణచేయక ఊరుకోడమ్మా!

బ్రాహ్మణి: కాదు కాదు నాయనా! భగవంతునికి ఉండే దయ కంటె మనుష్యమాత్రులము మనకెక్కువ దయ ఉంటుందా? కాకపోతే కఠినంగా కనబడుతుంది మధ్య మధ్య. అసలు శిక్ష అంటే ఏమిటి? బాగుచేయడమే కదా! నాట్యశిక్షణపొందేవాళ్ళ చూడు, ఈ వేలువంచి, ఆ పదము వంచి, ఈ కన్ను తిప్పి, ఆ చేయి తిప్పి, కాలివేలుమీద నిలిచి ఎంతెంత శ్రమపడతారు! నాట్యాచార్యులవంటి వాడే భగవంతుడుకూడాను. మన మంచి చేసేవాడు.

శ్రేష్ఠి: అమ్మా—ఏదో అసందర్భంగా అడిగినానని కోపించవద్దు. ఉపాధ్యాయులవారు నాట్యశాస్త్రంకూడా అధ్యయనంచేశారా?

బ్రాహ్మణి: ఇందులో తప్పేమీలేదు. నాకు నేర్పారుకూడా నాయనా. వారితో సమానంగా నృత్యంచేయగలవారు శ్రీకృష్ణులొక్కరేనట. బలరాములుకూడా అలసిపోయేవారట.

శ్రేష్ఠి: అమ్మా, ఇంత బక్కచిక్కి ఉన్నారుగదా, ఆ విద్య మరుపు రాకుండా ఉన్నారా!

బ్రాహ్మణి: వారికి మరపా? వారిది మహాయోగుల శరీరము, ఎటుబడితే అటు మైనమువలె ఒదుగుతుంది. వారి జవసత్వాలు నీ కెట్లా తెలుస్తవి! అవి ఆత్మశక్తిలో నుండి ఉద్భవించేవి కనుక విశ్వవ్యాపకమైనవి—సరేగాని మరి చెప్పకపోతివి, మా కీ ధాన్యాదులంతా ఎవరిచ్చారు?

శ్రేష్ఠి: నేనే! మీ పొలాలన్నీ స్వయంగా కూలీలనుపెట్టి చేయిద్దామని ప్రారంభించానమ్మా!

బ్రాహ్మణి: ఇప్పటికే నీవిచ్చిన ఋణము తీరకపోతే, ఇంకా ఈ ఋణమంతా ఎట్లా తీర్చగలము నాయనా!—అయ్యో, మళ్ళీ ధాన్యమెందుకు పంపినావు!

శ్రేష్ఠి: మీరు నాకేమీ బాకీ లేరు.

బ్రాహ్మణి: అదేమి మాట! మమ్మును నీ ఋణాన పొమ్మంటావా?

శ్రేష్ఠి: కాదు కాదు వినండమ్మా! దుక్కికట్టించి దున్నడం ప్రారంభించిన రోజే నాగలికి నిధి తగిలింది. దానితో నేను మునుపిచ్చిన అప్పంతా తీరిపోగా, వ్యవసాయ ఖర్చులకూ, మీకు పంపిన ధాన్యాదులకూ సరిపడి, మీ పేర నా లెక్కలో ఇంకా చాలా నిలవవున్నది—ఒక్కదానికే నేను చాలా బాధపడుతున్నాను తల్లీ!

బ్రాహ్మణి: ఏమి టది?

శ్రేష్ఠి: ఏమీ లేదు తల్లీ! మీ పిల్లలు బాధపడితేగాని మీరు ఉపాధ్యాయుల వారిని ద్వారకకు పొమ్మనరు — అందుకని నాలుగయిదు రోజులు మీకు కావలసిన ధాన్యం పంపక బాధ పెట్టినాను, పాపిష్ఠివాడను.

బ్రాహ్మణి: నీ తప్పేమిటి అందులో? మాకు నీవు ధాన్యం పంపవలసిన బాధ్యత ఏమున్నది?

సుదా : ఆఁ, ఆరువేలలా? రెండురోజులుకూడా ఐనట్లులేదే. నిజంగా ఆరువేల ఏళ్ళయిందా? నిజంగా?

శ్రీకృ : నీతో అబద్ధం ఆడుతానా?

సుదా : ఎవరితోనూ అబద్ధమాడవు, సత్యస్వరూపుడవు!

యశోద : నమ్మబోకు నాయనా, వాడు పుట్టిన అబద్ధాలపుట్ట!— వేను పుచ్చిన రోజవేసినా ఎప్పుడూ ఎచ్చింది—మొన్నటే నాయనా!

సుదా : శ్రీకృష్ణుడు ఆరువేలంటున్నాడు గా. వాడన్నమాటే ఖాయమై ఉండాలె!

యశోద : అయ్యో తండ్రీ, వీడు పెట్టిమాయగాడు. ఊళ్లో అందరి ఇళ్ళల్లో వెన్నలు మింగి వచ్చి నాదగ్గర దాక్కుని, వాళ్ళు మొరపెట్టుకుంటూ ఉంటే, ఏమీ ఎరగనట్టే వాడు. నేనూ వాడిమాట నమ్మి ఆ గోపికలతో పోట్లాడే దాన్ని!

సుదా : మన కృష్ణుడు అబద్ధం ఆడడమ్మా! ఆ గోపికల పిల్లలే కృష్ణవేషముతో వెన్నలు మెక్కేవాళ్ళేమో!

యశోద: ఆహా, మంచి సాక్షిగాడివే అయ్యా, నీవు కిష్టయ్యకు!— అయితే పోనీ, బలరాముడుకూడా అబద్ధాలకోరేనా? అతడే ఒకనాడు కిష్టయ్య మన్నుతిన్నాడని చెప్పినాడు. ఈ కిష్టయ్య మన్నులేదని నోరుతెరిచి చూపినాడు—అందులో బ్రహ్మాండంలో మట్టి అంతా నేను కళ్ళారా చూశాను! ఏం చేసేది? ఈ దొంగచక్కరును కొట్టలేకపోయాను!

సుదా : యశోదమ్మ తల్లీ, నీ వెన్నన్నా చెల్లుబాటు అవుతుంది కాని, నాకు కృష్ణునికంటె సత్యములేదు—బలరామునితో సహా అంతా అసత్యమే!

యశోద : వాణ్ణి నమ్మకు కూచుంటే నిలవాక మయిపోతే, తండ్రీ! నాకు కొడుకని నమ్మించి, నా పాలు తాగి, వ్రేపల్లె అంతా ఒక కొలికికి తెచ్చి, ఇప్పుడే దేవకీ దేవుల వారి కొడుకని ఈ దివ్యభవనాలలో చేరాడు. మళ్ళీ, నన్ను అమ్మా అంటూనే ఉంటాడు. (కళ్ళనీళ్ళు పెట్టుకుంటుంది.)

సుదా : మీ రిద్దరూ ఎంతపుణ్యము చేసుకున్నవారోనమ్మా! ఇద్దరూ అమ్మలే, అబద్ధం ఏమున్నది?

సత్యభామ: స్వామీ, మీకెంత స్నేహాభిమాన మున్నా, శ్రీకృష్ణులు అబద్ధమాడరంటే నే నొప్పను.

సుదా : ఎందువల్ల తల్లీ ?

సత్య: వినండి. మీ స్నేహితుడు, ఈయనగారున్నారే, రోజూ నాతో "నీ కంటె నాకు ప్రియురాలు లే"దని అంటూ ఉంటారు, మిగిలినవారిని అడగండి, వారితో ఏమంటూ ఉంటారో?— రుక్మిణి అక్కయ్యా, దాచక చెప్పండి !

రుక్మిణి : ఎప్పుడన్నా ఒకొక్కప్పుడు, 'నీకంటే నాకు ప్రియురాలు ఎవరూ లేరు సత్యా' అంటారు నాతో.

జాంబవతి : 'నీవే మహిషులందరిలో భక్తురాలవు రుక్మిణీ' అంటారు నాతో!

భద్ర : 'నీ నవ్వుల ఎంత బాగున్నావు జాంబవతీ' అంటారు నాతో ఒకొక్కసారి! (ఫక్కున నవ్వుతుంది.)

మిత్రవింద : స్వామీ, మీ మిత్రులు శ్రీకృష్ణస్వాములవారి సత్యసంధత చెబుతా వినండి, అయితే! ఒక్కొక్కవాడు నన్ను రుక్మిణీ అని పిలుస్తారు. ఒకవాడు, 'నీవు సత్యభామవలె కోపిష్టివి కావే, సుదంతా' అంటారు నాతో—ఇంకా ఇంకా ఎన్నో ఎన్నో ఉన్నవి మీ మిత్రులవారి సత్యవాక్యాలు !

[అంతా నవ్వుతారు.]

సుదంత : 'నీవు అమృతస్వరూపిణివి కాళిందీ' అంటారు నాతో!

కాళింది : 'నీ కంటె నా కెవరూ ప్రియులు కారు మిత్రవిందా' అంటారు నాతో !

లక్షణ : ఒకనాడు స్వామివారు—ఎప్పుడో కాదు నిన్ననే— 'సుదామా నీమీద నాకెంత ప్రేమ రా' అన్నారు.

[అష్టమహిషులంతా పగలబడి నవ్వుతారు.]

సుదా : (అరమోడ్పు కన్నులతో) ఆహా, ధన్యుణ్ణి నేను!—మా చెల్లెళ్లకు అతిపరిచయమువల్ల శ్రీ కృష్ణస్వరూపము తెలియడల్లేదు ఉంది—ఆతనికి అన్నిరూపాలూ నామాలు ఒక్కటిగానే ఉంటవి. అజ్ఞానులమైన మనకే నమ్మా, ఈ నామరూపభేదాలు! అతన్ని వదలండి, నావంటి అజ్ఞానికే, మీరు ఎనిమిదిమందీ ఒక్కటిగానే ఉన్నారు..

సత్య : ఇద్దరూ సావాసగాళ్లు కాదూ? స్వామీ, మీకుకూడా ఈ సత్య కోపిష్ఠురాలుగానే కనబడుతుందా?

శ్రీకృ : అమ్మ నాయనా, ఆ సత్యకు నీవైనా సమాధానము చెప్పు స్వామీ, నన్ను వంపుకు తింటుంది.

యశోద : సత్యభామమ్మా! వాడు నిన్ను కోపిష్ఠి అని ఎవరితోనైనా అన్నాడే అనుకో! అంతమాత్రానికే కోపమైతే ఎట్లా తల్లీ ?

దేవకీదేవి : సత్యా, వాడొకవేళ నీవు కోపిష్ఠివని అన్నాడే అనుకో! ఇట్లా మాట్లాడినావంటే, వాడన్నది నిజమే అని మా కందరికీ అనిపిస్తుంది.

సత్య : అంతా ఒక్కటేవాళ్లే (ఏడుపు సాగిస్తుంది.)

సుదా : చెల్లీ, ఎంత అజ్ఞానురాల వమ్మాయమ్మా, నీవు!

సత్య : అవును. అజ్ఞానురాలిని. పట్టి మూఢురాలిని. కనుకనే అంతాకలిసి నన్ను కోపిష్ఠిదాన్నని వేలుపెట్టి చూపి నలుగురిలో ఇట్లా అల్లరి చేస్తున్నారు.

శ్రీకృ : నాయనా, సుదామా ! నీవు అమాయికంగా నాకెంత చిక్కుతెచ్చిపెట్టావు ! ఎప్పటికి ఈ సత్యకోపము తీరేట్లు !

సుదా : మా సత్యమ్మ తల్లి కోపిష్ఠిదే ముమ్మాటికీ!—సత్యమ్మా!— అసలు కోపిష్ఠి—కోపన అంటే ఏమిటో తెలుసా?— అమాయికురాలు అని, ముద్దరాలు అని అర్థము!— మరి నీవు అమాయికురాలివి అవునా, కాదా ?

సత్య : అవును, అమాయికురాలనే, కాని కోపిష్ఠి నంటే? !

సుదా : ఉన్న సంగతి అంటే కోపమెందుకు చెల్లీ! వాణ్ణి అబద్ధమాడ మంటావా, సత్యసంధుణ్ణి! తన సత్యసంధత నిలుపుకోడానికే నిన్ను కట్టుకున్నాడు. నిన్ను కట్టుకోబట్టే ఇతను సత్యేశ్వరుడైనాడు,—లేకపోతే అసత్యేశ్వరుడే !

సత్య : (కళ్లనీళ్లు తుడుచుకుంటూ) నేను కోపిష్ఠురాలినే, అని సుదాములవారు, సాక్షాత్తు కులపతులవారు, కితాబు ఇచ్చారుగా ! ఎంత కష్టము కలిగిస్తున్నావో ప్రభువులకు?

సుదా : అదుగో, సత్యమ్మ చెల్లీ, అదేనమ్మా నీ పొరపాటు ! నీ స్వామికి ఎవరు ఎటువంటివారో వాళ్లు అట్లా ఉంటేనే ఇష్టము! నీకంటే ప్రియులు లేరని అతను చెప్పేది నిజమే !

లక్షణ : మా అందరితోనూ అదే అంటారు గదా ! అదికూడా నిజమేనా !

సుదా . ఆహా, అక్షరాలా !

యశోద : ఈ విరుద్ధాలన్నీ నిజ మనడానికి, మా కృష్ణుడి స్నేహితుడికి నీకే తగిపోయినదయ్యా !

సత్య : బాగా లన్నావమ్మా, అత్తయ్యా! ఈ బ్రాహ్మణోత్తముని మేమే మనగలము! అందులో శ్రీకృష్ణప్రభువుల వారి సాన్నిధ్యములో !

సుదా : శ్రీ కృష్ణా !—వీళ్ల శంకలన్నీ గురుకులములో బాల విద్యార్థుల కుశంకలవలెనే ఉన్నవి. వీళ్లనందరినీ మా గురుకులానికి పంపరాదూ—విద్యాశిక్షణకు !

శ్రీకృ: బ్రతికించావు ! — వీళ్లందరినీ నీ గురుకులములో విద్యాబుద్ధులు చెప్పి పంపించి రక్షించు నన్ను, సుదామా!

సుదా : అంతకంటేనా ?

శ్రీకృ : అయితే వస్తారేమో అడుగు.

సుదా : కులపతులు విద్యార్థులను రమ్మని అర్థిస్తారా?

శ్రీకృ: అవునవును—రుక్మిణీ, సత్యా—మీరంతా గురుకులానికి విద్యాభ్యాసానికి వెళతారా?

రుక్మిణి, సత్యా—అష్టమహిషులు, వెళుతాము—వెళతాము—వెళుతాము !

శ్రీకృ: అయితే కులపతి సుదాముని అర్థించండి.

అష్టమహిషులు: స్వామీ, మీ పాదాలు ఆశ్రయించాము. మాకు బ్రహ్మవిద్య ఉపదేశించండి!

సుదా: సంతోషము. ఇక్కడనా? గురుకులములోనా?

అష్టమహిషులు: మీ చిత్తము వచ్చినచోట !

సుదా: న్యాయంగా గురుకులానికి రావలసినదే కాని మీరక్కడ ఉంటే శ్రీ కృష్ణస్వామి బెంగపెట్టుకుంటాడేమో ! ఇక్కడే ఉపదేశిస్తాను.

దేవకీదేవి: నాకుకూడా ఉపదేశించు, స్వామీ!

సుదా: అంతకంటేనా !

యశోద: నాకుకూడా ఉపదేశించు, స్వామీ !

సుదా: తప్పకుండా !—శిష్యురాండ్రల్లారా, వినండి శ్రద్ధగా ! శ్రీ గురువులవాక్యాలు శ్రద్ధగా వినాలి. శ్రీ గురువులు ప్రత్యక్షంచేసే ఉపదేశము పరమప్రమాణంగా గ్రహించవలె సుమా !

అందరు: చిత్తము—చిత్తము—చిత్తము.

సుదా: 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అని శ్రుతి చెబుతున్నది. ఆ పరబ్రహ్మ మీ కళ్ల ఎదుట ప్రత్యక్షంగా ఉన్నది కృష్ణస్వరూపముతో—మీ చర్మచక్షువులు మూసుకొని అంతరంగదృష్టితో దర్శించండి!—కనబడుతున్నదా?—

అందరూ: (ఆనంద తన్మయులై) ధన్యురాండ్రము !

సుదా: మీ కళ్లకేమి కనబడుతున్నది?—చెవులకేమి వినబడుతున్నది ?—

రుక్మిణి: అంగనా మంగనా మంతరే మాధవో

సత్య: మాధవం మాధవం చాంతరేణాంగనా

జాంబ: ఇత్థ మాకల్పితే మండలే మధ్యగః

కాళింది: సంజగౌ వేణునా దేవకీనందనః

లక్షణ: క్వాపి వీణాభి రారావిణా కంపితః

సుదంత: క్వాపి వీణాభి రాకింకిణీ నర్తితః

మిత్రవింద: క్వాపి వీణాభిరామాంతరం గాపితః

భద్ర: సంజగౌ వేణునా దేవకీనందనః

దేవకీదేవి: బాలికా తాలికా తాళలీలాలయా
సంగసందర్శితభ్రూలతావిభ్రమః

యశోద: గోపికాగీతదత్తాంతరావః స్వయమ్
సంజగౌ వేణునా దేవకీనందనః

సుదా: చాలు—చాలు!—మీకు బ్రహ్మవిద్య అనుభవానికి వచ్చినది !

అందరు: కృతార్థులము స్వామీ !

సుదా: అమ్మల్లారా, అమ్మాయిల్లారా! —చిత్రమదేనమ్మా!—ఎప్పుడూ ప్రత్యక్షంగా ఉన్న సత్యాన్నే చూడకుండా కళ్ళు మూసుకుంటాము !- నేను వచ్చి ఆరునెలలయినదని శ్రీకృష్ణయ్య చెప్పినాడు—ఇన్నాళ్ళా మీరు నాకు చేసిన ఉపచారాల ఋణము తీర్చుకున్నాను.

రుక్మిణి: మాకు గురుదక్షిణ ఇచ్చే ప్రసక్తి లేకుండా ఉపాయము చేస్తున్నారు.

దేవకీదేవి: తన సుహృత్తుకు ఖర్చులేకుండా చేస్తున్నాడు, స్వామీ !

సుదా: అమ్మా, మీకు ఉపదేశించడమువల్ల నాకూ ఈనాడు బ్రహ్మవిద్య ప్రత్యక్షమైనది. కృతార్థుణ్ణి! కృష్ణా ! నా విద్యార్థులు పాపము బెంగపెట్టుకుంటారు. పాపము మా బ్రాహ్మణి కూడా దిగులుపడుతున్నదేమో—ఆరునెలయిందా వచ్చి! అనుజ్ఞ యియ్యి, శ్రీకృష్ణా !—నిన్ను విడిచిపోలేకున్నాను !—అయినా తప్పదు గదా!

శ్రీకృష్ణుడు: సుదామా, అట్లాగే !—నన్ను మరచిపోకుసుమా!

సుదాముడు: (ఆనందబాష్పంలతో) వెళ్లలేక వెళ్లలేక వెళుతున్నాను. అమ్మా మరచిపోకండి మమ్ము !

దేవకీదేవి: చిత్తము. కృష్ణా, దారుకుణ్ణి రథము తెమ్మను!

సుదాముడు: కులపతులు రథాలు ఎక్కుతారా, తల్లీ!—వద్దు! (బయలుదేరుతాడు)

[అంతా నిర్విణ్ణులై చూస్తూ ఉంటారు.]

## తొమ్మిదవ రంగము

[ద్వారకానగరవీథి: నలుగురు పౌరులు ప్రవేశము]

1వ పౌరుడు: కుచేలస్వామివారు తిరిగి వెళుతున్నట్లున్నారు.

2వ పౌరుడు: శ్రీకృష్ణప్రభువులు విచిత్రపురుషులు.

3వ పౌరుడు: స్వామి సన్నిధిలో వీరు ధరించినవి దివ్యాంబరాభరణాలు. ఇప్పుడు మళ్లీ యథాప్రకారము కుచేలవేషమే !

4వ పౌరుడు: ఈ కుచేలస్వామి ఎంత మహానుభావుడో గమనించండి ! ఆ దివ్యాంబరాభరణాలతో కంటె, ఈ కుచేలాలతోనే ఈయన ఎక్కువ శోభిస్తున్నాడు ! ఆయన శరీరమంతా ఆనందములో పులకరించి ఉన్నది ; అంతరంగమంతా శ్రీకృష్ణతరంగితమై నాట్యముచేస్తున్నట్లున్నది—ఆయన నడపడమే లేదు.

1వ పౌరుడు : ఆహా, అయన నాట్యముతోనే ముందుకు సాగుతున్నాడు. ఈ మహామహుని దర్శనమువల్ల మనము కృతార్థులము !

[తెర]

## పదవ రంగము

[గురుకులములో వీధి]

సుదాముడు : (ఆనందతన్మయుడై) కృష్ణా, రుక్మిణీప్రియా, సర్వేశ్వరా, దేవకీనందనా, యశోదాతనయా !—నా హృదయంలో వేణుగానంచేస్తూ నృత్యముచేస్తున్నావా?

ఛాత్రులు : (సంభ్రమముతో నలువైపులనుంచి ప్రవేశించి) కులపతులవారు వేంచేశారు ! గురుదేవా, నమస్కారాలు !

సుదాముడు : నాయనలారా, అంతా క్షేమమా !

ఛాత్రులు : చిత్తము, తమ అనుగ్రహమువల్ల !

సుదాముడు: ఈ భవన మెవరిది?

ఛాత్రులు : తమదే గురుదేవా !

బ్రాహ్మణి : (పరిచారికలతో సంభ్రమముతో ప్రవేశించి, పరిచారిక అందించిన కనకపాత్రలోని జలముతో భర్త పాదాలు కడిగి తన శిరస్సునా ఛాత్రుల శిరస్సులమీద చల్లి) స్వామీ, ఎన్నాళ్లకు మాకు దర్శన మిచ్చినారు !

సుదాముడు : మొన్న ఆ శ్రీకృష్ణుడు చెప్పేవరకూ వెళ్ళి ఆరునెలలయినదని తెలియదు అంతా రెండురోజు లనుకున్నాను.

బ్రాహ్మణి : స్వామీ, తమరు వెళ్ళి ఆరునెలలు కాదు, సంవత్సరమయింది.

సుదాముడు : నిజంగా ?

బ్రాహ్మణి : నిజము—ఆరునెలల క్రిందట ద్వారకానగరానికి మనుష్యులను పంపితే, స్వామివారు విద్యార్థులమీదను బ్రాహ్మణిమీదను బెంగపెట్టుకొని గురుకులానికి బయలుదేరి వెళ్ళినారని సెలవిచ్చినారు !—దేశదేశాలకూ మీరెక్కడ ఉన్నారో అని మనుష్యులను పంపినా మీ జాడ తెలియక దిగులుపడిపోతున్నాము, ఈ ఆరునెలలూ !

సుదాముడు : నిజంగా?—మొన్ననేగా నేను ద్వారకానగరంలో బయలుదేరినది!—శ్రీకృష్ణస్వామి నా అంతరంగమంతా నిండి ఉన్నాడు ! చెప్పలేనూ నేను ! వాడికి నామీద ఎంత ప్రేమ ! రుక్మిణి, సత్య, కాళింది, భద్ర—ఒక్కరేమిటి వంతులువేసుకుంటూ నాకు సమస్తోపచారాలు చేసేవాళ్ళు !—బ్రాహ్మణీ, ఈ భవన మెవరిది ?

బ్రాహ్మణి : మీరు శ్రీకృష్ణ భగవానుని దర్శనానికి వెళ్ళిన ఫలము !—మాకెందుకు ఈ భవనాలని అంటూఉన్నా, మన శ్రేష్ఠి, కాదు కూడదు — శ్రీకృష్ణపరమాత్ముల ఆజ్ఞ అంటూ కట్టించినాడు !—అదుగో శ్రేష్ఠి వస్తున్నాడు. వీనినే అడగండి !

శ్రేష్ఠి : (ప్రవేశించి) కులపతులకు దణ్ణాలు !

సుదాముడు : కుశలమా, శ్రేష్ఠీ !—ఏమిటి ఈ భవన నిర్మాణము! ధనమెక్కడిది?

శ్రేష్ఠి : అంతా శ్రీకృష్ణులవారి కటాక్షము !—మీ రటు శ్రీకృష్ణులవారి దర్శనానికి బయలుదేరిందే మొదలు—కొల్లరయితులు వచ్చి మన పొలాలు సుక్షేత్రాలు చేశారు. సకాలములో వర్షాలు కురిసినవి. కరువు పోయినది. అప్పులు తీరినవి. ఊరంతా సుభిక్షంగా ఉన్నది. రయితులంతా మేడలు కట్టినారు మీ లెక్కలో డబ్బు మూలుగుతున్నది.

సుదాముడు : నిజం ?

శ్రేష్ఠి : మూడు రాత్రులు శ్రీకృష్ణులు స్వప్నములో దర్శన మిచ్చి ఆ ధనము ఈ భవనాలు కట్టించమని ఆదేశించారు. అమ్మగారు వద్దంటున్నా నేనే శ్రీకృష్ణాదేశము వల్ల పట్టుపట్టి కట్టించాను గృహప్రవేశము చేయండి తమరు అమ్మగారితో !

సుదాముడు : (అందరూ దారి చూపుతూ ఉండగా గృహప్రవేశము చేస్తూ) ఆహా, ఇప్పుడు తెలిసినది. శ్రీకృష్ణుడు పట్టి మాయలాడు ! అప్పుడు సత్య అంటుంటే కాదన్నాను కాని శ్రీకృష్ణుడు పట్టి అబద్ధాల పుట్ట ! సత్యావాక్యము సత్యము ! ఈ సంపద చూపి తనను మరుస్తానేమో పరీక్షించదలచినాడు!—బ్రాహ్మణీ, శ్రీకృష్ణుణ్ణి మరిచేవు సుమా, ఈ ఐశ్వర్యంలో !

[తెర]

# ఇంద్రచాపము

## శ్రీ వఝ్ఝల కాళిదాసు

భావి!.... కలల విన్న భావసంగీతంబు,
పుటలు విప్పబడని పుస్తకంబు,
కాలరాక్షసి లయకాలగర్జాధ్వని,
ఉల్లమలర విచ్చు మల్లెమొగ్గ!

ఈ దరిద్ర మార్గమ్ముల నిందుకిరణ
జాలములు ప్రాకనేమొ యుగాల నాటి
ముసలి ముడుతలతో — శల్యములను కొరికి
విరుచు చలిమంచు గాలులే వీచు నిచట!

గిరి గుహా ముఖమ్ములనుండి పరుగు వెట్టి,
భూజముల ద్రోసుకొని వచ్చి, పూలతోట
లం బరిభ్రమించి, సరోవరంబు లందు
జలకముల వాడి, దక్షిణానిలము వీచు.

ఆత్మ బట్టలేని యాక్రందనోద్ధతి
వే నెలుంగు నెత్తి యేడ్చు చుండ
దిక్కులన్నియును ప్రతిధ్వని రూపాన
కసరు కొనుచు ద్రిప్పి విసరి కొట్టు !

పట్టుమీద వద్దబడిన లేతగులాబి
రంగు బుగ్గలందు పొంగు లురల
పాలకడలి తల్లి వక్షమ్ముపై వాడు
పాప నవ్వు లమృతభాండములగు!

తారకా మల్లికా కోరకమ్ములకు
ప్రతిరాత్రి జననమ్ము ప్రత్యుదయ మృతి!

నీలాంబరంబున నిల్చిన శశికి
కన్పించెనా సరోగర్భాన ముఖము,
పూర్వ మెన్నడులేని మోహన గతుల
నవ్వుచున్నాడు విన్నాణమ్మునిండ!

నీవు నేను నిచట నిల్చిన యంతనే
గాలి యేల నిల్చు గదలకుండ;
మనము చెప్పుకొనెడి మాటల నాలింప
నెమ్మదిన్ గుతూహలమ్మొ యేమొ?

సంజదారులందు చక్కగా నేతెంచు
లలితమ్మైన లే గులాబి కన్నెఁ
బట్టె వెనుక కీడ్చి వైచుచున్నవి
కారు నలుపు రంగు కరము లెవియొ!

ఈ రజని మోముపై నీలి యిరులకురులు
ముడులువడును విరియబారు కడల నెల్ల;
అక్కడక్కడ పోగైన చుక్కలేల
విరగబడి నవ్వు నిదియేదొ వింతయుట్లు.

కొసరి కొసరి పాడు కోయిల యెచటికో
కదలి చనిన వెట్టకారురేయి
ఆకు సందులందు నావంత గుసగుస
లాడుకొనవు గాలులైన నేడు!

ఈ మహాకాళరాత్రికి నెన్ని కనులో
ఆ సహస్రాక్షుడే వెరగందుఁ జూచి
రెప్ప లల్లార్చు మిణుగురు, లుప్పరమున
దళుకు మనుచు జారిపడుచు దార కాళి!

కనులు చెదరగొట్టు ఘనపల్లికాతతి,
గుండియలను బెదరగొట్టు పిడుగు,
లవని ముంచువర్ష, మైన నేమాయెను?
క్రొత్త ముదము లిచ్చు రోహితమ్ము!

ఉదయ సుందరి వచ్చుచున్నది మిటారి
కులుకు కెందమ్మి పువ్వుల కొలనులందు
జలకమాడి లే బంగరు వలువ మెల్ల
జార విడుచుచుఁ గ్రొత్త యొయ్యార మొలుక!

వెన్నెలల సీను నీ చంద్రబింబమింక
కడల పిలులే దీగీత గడచి యనుచుఁ
జిహ్వ మొక్కటి ప్రకృతి రచించె ననగఁ
గనబడును పరివేష మాకసమునందు !

ఇన్ని మెరపులు మెరయు నీ చిన్నిమొయిలు
తునుక కురియలే దేమొక్క చినుకునైన?
ఏక భావమె రగులు నా హృదయమందు
బొడము నేటికొ, బాష్పంబువులు తడబడి!

# రామాయణ కథాగానము - అధ్యాత్మరామాయణ విశిష్టత

కుమారి యం. యస్. రాణీ ప్రమీలాదేవి

భారతీయ సంస్కృతికి వేదము ఆధారమైనను అది పుష్పఫలవంతమై చల్లని నీడనిచ్చే వృక్షరూపముగా ప్రసరించినది రామాయణ, మహాభారతాలవలననే. ఒక్క భరతఖండములోనే కాక భారతీయ సంస్కృతి వ్యాపించిన విస్తారభారతము (Greater India) అని పిలువబడే బర్మా, సయాం, కంబోడియా, మలయా, బలి, జావా, సుమత్రా, బోర్నియో—ఇత్యాది దేశాంతర, ద్వీపాంతరాలలోకూడా ఈ రెండు ఇతిహాసాలు విస్తరించి అక్కడ స్థిరనివాస మేర్పరచుకొన్నవి. ఆ రెంటిలోనూకూడా ఆదికవి రచించిన రామాయణకథ ఎక్కువ అభిమానపాత్రమైనది.

రామాయణము ఇంతగా అభిమానపాత్రము కావడానికి ప్రధాన హేతువు దాని రచనావిశేషములోనే ఉన్నది. స్వయముగా వాల్మీకియే దానినిగురించి 'పాఠ్యే గేయేచ మధురమ్' అని చెప్పుకొన్నాడు. అంటే నేటి సంగీతవిద్వాంసుల పరిభాషలో మాతు, ధాతువులలో మాధుర్య మున్నదన్నమాట! వాక్కుకు మాతువని, గేయమునకు ధాతువని సంజ్ఞలు. ఈరెండూ చేయువాడే వాగ్గేయకారుడు. ఈ దృష్టితో విచారిస్తే వాల్మీకి ఆదికవి మాత్రమే కాడు; ఆది వాగ్గేయకారుడు కూడా. నేడు వాల్మీకమునకు పాఠ్యముగానే ప్రచారమున్నదిగాని గేయముగా లేదు. దురదృష్టవశాత్తుగా దాని గేయసంప్రదాయము అంతరించి పాఠ్యముగానే నిలిచి ఉన్నది. కాని బాలకాండ నాల్గవసర్గము చదువునపుడు వాల్మీకి తన కావ్యములోని పాఠ్యతకుకంటే గేయతకే ఎక్కువ ప్రాధాన్య మిచ్చినాడా, అనిపిస్తుంది. ఆయన రామాయణ రచన పూర్తి చేసిన తరువాత దానిని కుశలవులకు ఉపదేశించిన సందర్భంలో — ఉన్నది—

"పాఠ్యే గేయే చ మధురం ప్రమాణై స్త్రిభి రన్వితమ్
జాతిభి స్సప్తభి ర్బద్ధం తంత్రీలయ సమన్వితమ్
రసైః శృంగార కరుణ హాస్య వీర భయానకైః
రౌద్రాదిభి శ్చ సంయుక్తం కావ్య మేత దగాయతామ్.
తౌతు గాంధర్వ తత్త్వజ్ఞౌ మూర్ఛనాస్థాన కోవిదౌ
భ్రాతరౌ స్వరసమ్పన్నౌ గంధర్వావివ రూపిణౌ
రూపలక్షణ సమ్పన్నౌ మధురస్వర భాషిణౌ''

కుశలవులు రాజమార్గములలో రథ్యలలో అది పాడి—వినిపించుచుండగా తెలుసుకొని స్వయముగా శ్రీరాముడే వారిని తన సన్నిధికి పిలిపించి తమ్ములు మొదలైన ఆప్తులతో పరిషత్తు తీరి కూర్చుండి, వారలను విసమనిచెప్పి ఆ గాయకులను చోదన చేసెనట! అప్పుడు

"తౌ చాపి మధురం రక్తం స్వంచితాయత నిస్వనమ్
తంత్రీలయవ దత్యర్థం విశ్రుతార్థ మగాయతామ్
హ్లాదయ త్సర్వ గాత్రాణి మనాంసి హృదయాని చ
శ్రోత్రాశ్రయ సుఖం గేయం తద్బభౌ జనసంసది...

* * *

తతస్తు తౌ రామవచః ప్రచోదితా
అగాయతాం మార్గ విధాన సంపదా—"

వారానాడు పాడినదే నేడు మనకు వాల్మీకి రామాయణ రూపమునుగా ప్రత్యక్షమై నిలిచి ఉన్న ఆదికావ్యము!

ఇందులో ఆశ్చర్య మేమీ లేదు. లోకములో ఎక్కడనైనా కవిత్వము ఆదిలో గేయ రూపములోనే ఆవిర్భవించింది. గ్రీకు కవి 'హోమరు' తన రెండు ఇతిహాసాలు — 'ఇలియడ్, ఒడిస్సీ' అను — ప్రభువుల ఆస్థానాలకు పోయి స్వయముగా 'లైరు' అనే తంత్రీ వాద్యము తోడుగా వినిపించేవాడని ప్రసిద్ధి. మన దేశములోనో, ఋషియైన ఆదికవి తన శిష్యులచేత తంత్రీలయ సమన్వితమైన గానము చేయించినాడు. అంతే భేదము!

మన గాన సంప్రదాయము ఎన్నెన్నో పరిణామాలు చెందినది. కాని మొదటినుండి మార్గ, దేశి విభేదాలున్నట్లు తోస్తుంది. రామాయణ రచన నాటికే 'మార్గ విధాన సమ్పదా' అన్న దానిని బట్టి ఈ భేదమును అనుమేయింపవచ్చును. కాని ఒకనాడు దేశిగా ఉన్నదే సహృదయులకు నచ్చి లక్షణవేత్తలు గ్రహించి లక్షణము నిర్వచింపగా, అదే మార్గ విధానముగా పరిగ

